SOUTHERN LANGUAGES BOOK TRUST

దక్షిణ భాషాపుస్తక సంస్థ సహకారమున ప్రకటితము

రూ 1/-



# కొకొరొ



సొసెకి. నట్సుమె



రచయిత: సోసెకి నట్సుమే

# ఈ పుస్తకాన్ని గురించి

సుప్రసిద్ధ జపాన్ నవలాకారుడు నట్సుమే నవల ఇది. బాధాకరమైన అనుభవాల కారణంగా తన్ను తాను పూర్తిగా నిరాకరించుకున్న సెన్సీ జీవితం ఇందులో చిత్రితమైంది తండ్రి మరణానంతరం పినతండ్రి తన ఆస్తినంతా కాజేస్తున్నట్లు తెలిసి, బంధుప్రేమలో, మైత్రిలో అతనికి విశ్వాసం నశించి, ఎవరితోనూ స్నేహంచేయరాదనే వైఖరి నవలంబిస్తాడు. ప్రియమిత్రుని ఆత్మహత్య పిడుగుపాటుగా పరిణమించింది. వివాహమాడదలచిన యువతి ద్రోహం చేస్తుంది.

జీవిత ఝంఝామారుతంలో చిక్కుకుని మృత్యువుద్వారా విముక్తి పొందాలని యత్నించిన ఉత్తమ పురుషుని విషాదగాథ. హృదయాన్ని కదిలించే ఇతివృత్తం! జపానీయుల జీవితవిధానాన్ని, అందులో వెలుగు నీడలను ద్యోతకం చేసే గాథ.

Wrapper Printed at Swatantra Art Printers, VZA.

# కోకోరో



[జపానీస్ నవల]



రచన: సొసెకి నట్సుమే

అనువాదం: శ్రీనివాస చక్రవర్తి




ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

ప్రథమముద్రణ
5000 ప్రతులు
నవంబరు - 1957

ముద్రణ : లీలాప్రెస్,
విజయవాడ.

వెల : ఒకరూపాయి

దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారమున ప్రకటితము

# పరిచయం

దక్షిణ భాషా పుస్తకసంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథసంచయములోని తొలిప్రచురణ లివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం - నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింపచేయాలనే సత్సంకల్పంతో, సముదార దూరదృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను ప్రచురణకర్తలచే అందంగా అచ్చువేయించి అందరికి అందుబాటులోఉండే సరసమైన ధరలకు అందచేయాలనే ఆదర్శంతో మూడేళ్ళ కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలా లివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాలజోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగాఅందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమగ్రంథాలను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వత శ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమగ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింపచేయడం వీరి ప్రధానలక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే 'ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం' అనేదే దక్షిణభాషా పుస్తకసంస్థ వారి పరమాశయం.ఇందులో వీ రెంతవరకు కృతకృత్యులైనదీ ఇప్పు డీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయింపవలసిఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చే పది సంవత్సరాలవరకు అంతగా కనబడకపోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుతమైనదని, అత్యంత ప్రధానమైనదని మాత్రం దూరదృష్టిగలవారందరూ ఒప్పుకొనక తప్పదు. ఇందుకుగల అవకాశాలు అనేకం. అందమైన అచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల కుగ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరిజీవితాలకు కొత్త వెలుగునీ, విజ్ఞానాన్నీ అందించగలవు.

దక్షిణ భాషా పుస్తకసంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం - నాలుగు దక్షిణాదిభాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీనకాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణాపథమనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలనూ వాడి ప్రాంతీయవికృతులను మాత్రమే వాడుక

చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాష లనడం నా అభిమతం కాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషాపరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలకు మధ్య సహజమైనసన్నిహితసంబంధాలు చాలాఉన్నవి. పైగాఆర్యావర్తంలో వ్యాప్తిలోఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయసంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్పసంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తకసంస్థవారి ప్రోత్సాహం వల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి ప్రశుతిమించి పోకుండా సమగ్ర భారతసంస్కృతిని ప్రతిబింబింపజేసే పుస్తకాలను, విశ్వమానవ సౌభాతృత్వాన్ని, ప్రపంచకల్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాల అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

పా. వేం. రాజమన్నారు.

# తొలిపలుకు

సొసెకీ నట్సు మే ఆధునిక జపాన్ దేశపు ఉత్తమోత్తమ సాహిత్యవేత్త అనడంలో అతిశయోక్తి లేదు. అమెరికన్ రచయిత హాథరన్‌తోను, ఫ్రెంచిరచయిత విక్టర్ హ్యూగోతోను, ఆంగ్లరచయిత చార్లెస్ డికెన్సుతోను తులతూగే మహారచయిత సొసెకీ. ఈయన జననం 1867 లో. మరణం ప్రథమ ప్రపంచసంగ్రామకాలంలో. టోకియో ఇంపీరియల్ విశ్వవిద్యాలయ ప్రథమశ్రేణి పట్టభద్రులు. కొంతకాలం అధ్యాపకవృత్తి నవలంబించి, ఆ తరువాత ఆంగ్లసాహిత్యంలో ప్రత్యేక పరిశోధనలు జరపడానికి ఇంగ్లాండు వెళ్లారు. ఇంగ్లండునుంచి జపానుకు తిరిగివచ్చి, పుష్కరం కిందట తాను విద్యార్థిగా ఉన్న ఇంపీరియల్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా చేరారు. నాలుగు సంవత్సరాల తరువాత టోకియో ఆసాహి షింబూన్‌లో సాహిత్యశాఖ ప్రధానాచార్యులుగా ప్రవేశించారు. ఈ కాలంలోనే నవలారచనకు ఉపక్రమించారు. అంతవరకు కవిగా, చిన్నచిన్న 'పదచిత్రాలు' రచయితగా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. 'లండన్ గోపురము' 'నేనొక పిల్లిని' అనే రచనలతో ఈయన ఖ్యాతి ఇనుమడించింది. 'నేనొక పిల్లిని' అనే నవల అనన్యప్రచారంగల ఒక సాహిత్యపత్రికలో వరుసగా ప్రకటితమైంది. ఈ నవ

లలో ఒక ప్రొఫెసర్ జీవితం అతని ఇంటిలోని పిల్లి దృష్టిలో చిత్రింపబడింది. ఆ పత్రికలో ఆ నవల ఆఖరు అధ్యాయంలో పిల్లి చనిపోయినట్లు చదివి [illegible]లు భోరున ఏడ్చారట! ఈ రచన ముగిసిన వెను వెంటనే వెలువడిన 'బొచాన్' అనే రచన నేటికీ జపానులో విశేష ప్రజాదరణ పొందుతున్నది. కాని చాలాకాలంతరవాత ఈయన రచించిన రెండుభాగాల గ్రంథంతో ఈయన సాహిత్య ప్రతిభ పరాకాష్టకు చేరుకున్నది. మొదటిభాగంలో 'సాన్షిరో' 'అప్పుడు' 'గేటు' అనే రచన లున్నాయి. రెండవభాగంలో 'విషువత్తువదమ్' 'తరవాత' 'దారినబోయేమనిషి' 'కోకోరో' అనే నవలలున్నాయి. 'వెలుగునీడలు' అనే ఆఖరునవల రచిస్తూ రచిస్తూ ఈయన అసువులుబాశారు.

నట్సుమె సొసెకి మ్యూజీయుగంలో జీవించడంవల్ల ఆ యుగానికి చెందిన సంస్కృతి, భక్తి విశ్వాసాలు, పాశ్చాత్యభావాలప్రభావం ఈయన రచనలో ప్రతిబింబించాయి. వీరి ప్రారంభరచనలో ఎక్కువగా హాస్యం, చమత్కారంతో కూడిన అవహేళన పొడగడుతుంది. ముక్తి, ఆత్మశాంతి కోసం అన్వేషణల విషయమై ఈయనమనసులో చెలరేగిన తుపాను ఈయన రచించిన మూడునవలలలోను ద్యోతకమవుతుంది. జీవితదృక్పథంలో నిరాశా నిస్పృహాలు ఈ కాలం

లోనే ప్రారంభమయ్యాయి. ఈ నిరాశా నిస్పృహలమూలం గానే 'కోకారో' అంతటా విధి సిద్ధాంతపు ప్రాబల్యంతో బాటు, అందులోని పాత్రలు జీవితానికి, విధికి ఏమాత్రం ప్రతిఘటించకుండా తలఒగ్గినట్లు కనబడుతుంది.

—శాంతా రంగాచారి.

# కో కొ రో

## ఒకటో భాగం

### సెన్సే - నేను

అతనిని నేను ఇంకో పేరుతో ఎన్నడూ పిలవలేదు. అందుచేత అసలు పేరు ఎత్తకుండా 'సెన్సే' అనే పేర్కొంటాను.

మొట్టమొదటిసారిగా మేము కమలారాలో కలుసుకున్నాము. అప్పటికింకా నేను చదువుకుంటున్నాను. శెలవులు. కొద్దిరోజులపాటు ఒక స్నేహితునితో గడుపుదామని కమలారా వెళ్ళాను. మూడురోజులు గడిచాయో లేదో వెంటనే ఇంటికి బయలుదేరి రమ్మని నా స్నేహితునికి తల్లిదగ్గరనుంచి తంతివార్త వచ్చింది. అతను వెళ్ళాడు. నేను ఒక్కడనే కమలారాలో దిగబడిపోయాను. కాని శెలవులు పూర్తిఅయే వరకు మేము బసచేసిన ఇంటిలోనే ఉండాలని నిశ్చయించుకున్నాను.

నా బస కమలారాలో మారుమూల ఉంది. దగ్గరలో సముద్రం. ఇంకేం, సర్దాగా ఈతకొట్టడానికి మహా వీలు. ప్రతిరోజూ సముద్రస్నానానికి వెళ్ళేవాడిని. సముద్రతీరం జనంతో కిక్కిరిసిపోయి ఉండేది. అక్కడ నే నెవరినీ ఎరగను. కాని ఆ ప్రదేశంలో వెల్లివిరిసే ఆనందం నన్ను చుట్టుముట్టి పరవశుణ్ణిచేసింది.

కళకళలాడే ఈ ప్రదేశంలో సెన్నేని చూశాను. స్నానంచేసేందుకని ఒక స్నానఘట్టంలో శరీరంమీది ఉడుపులు తీసివేస్తున్నాడు. అదే మొదటిసారిగా అతనిని నేను చూడడం. ఇక నేను స్నానంచేసి తిరిగి వస్తున్నాను. నా వంటిమీది తడి చల్లగాలికి ఆరిపోతూ హాయిగొలుపుతోంది. తీరంలో జనం హడావిడి ఎక్కువగా ఉంది. అయినా నా దృష్టి చివాలున సెన్నేమీద వాలింది. ఎవరో విదేశస్తునితో కలిసి వస్తున్నాడు. నీటిదరికి వెళుతూంటే ఊరికే కుతూహలంకొద్దీ వారిని కనిపెట్టి చూశాను. ఇద్దరూ నీటిలో దిగి, జనసమ్మర్దం ఎక్కువగాలేని చోటుదాకా వెళ్ళి అక్కడ ఈతకొట్టసాగారు. కొంతసేపయిన తరవాత తీరానికి సూటిగా బయలుదేరి స్నానఘట్టానికి తిరిగివచ్చారు. మామూలుగా చన్నీళ్ళస్నానం చేయకుండా వళ్ళు తుడుచుకున్నారు. దుస్తులు వేసుకుని చకచకా వెళ్ళిపోయారు.

ఆకాలంలో ఒంటరితనం అనుభవిస్తున్నానేమో, ఏదో ఒక సాహసకార్యం చేయాలని నాకు బుద్ధిపుట్టింది. మర్నాడు సరిగ్గా అదే వేళకు తిరిగీ స్నానఘట్టానికి వెళ్లాను.

ఈ తడవ సెన్నే ఒకడే వచ్చాడు. చాలామంది స్నానాలుచేస్తున్నారు. మహా గందరగోళంగా ఉంది. వీళ్ళందరిమధ్యనుంచీ తిన్నగా వెళ్ళి సెన్నే ఒంటరిగా ఈత కొడుతూంటే అతనిని అనుసరించి వెళ్ళాలని నాకు కోరిక కలిగింది. నీళ్ళు లోతు తక్కువ. తటాలున దూకాను. కాని నిన్నటిలాగా దూరం వెళ్ళకుండా అక్కడినుంచే ఈదుకుంటూ ఒడ్డుకు చేరాడు. నా ఎత్తు పారలేదు.

ఆ తరవాత వరసగా కొన్నిరోజులపాటు అతనిని కని పెట్టి చూశాను. అదేవేళకు ఒంటరిగా వచ్చేవాడు. ఎవరినీ గమనించకుండా తిరిగి చక్కాపోయేవాడు. ఒకరోజున మామూలుగా నీటిఅంచునుంచి చకచకా పరుగెత్తుకుంటూ వచ్చి, తొడుగుకుందామని 'యుకాటా' (వేసవిలో ధరించే దుస్తు) తీసి దులిపాడు. ఇంతలో దానికిందపెట్టిన కళ్ళజోడు బెంచీసందుగుండా జారి కిందపడింది. తీసి ఇచ్చాను. నాచేతిలో నుంచి కళ్ళజోడు తీసుకుంటూ కృతజ్ఞతాభివందనాలు తెలిపాడు.

ఆ మర్నాడు సెన్సే ఈతకొడుతూంటే అతనివెనకాల నేనూ యీతకొడుతూ వెళ్ళాను. చాలాదూరం సముద్రంమీదికి వెళ్ళినతరవాత సెన్సే వెనకకు తిరిగిచూసి నాతో మాట్లాడాడు. ఆవిశాలసముద్రంమీద మేమిద్దరమే; ఇంకెవరూ లేరు. సూర్యకిరణాలు తీక్షణంగా నీటిమీద పడుతున్నాయి. స్వేచ్ఛాభావంతో, సంతోషభావంతో నా కండరాలను సడలించుకున్నాను. సెన్సే కెరటాలమీద వెల్లకిలా పడుకున్నాడు. నేనూ వెల్లకిలా పడుకుని నీలాకాశంకేసి చూడసాగాను. ఇంతలో 'యింటికి పోదాం పద' అన్నాడు సెన్సే. సరేనని వెంటనే అంగీకరించాను.

ఈవిధంగా మేము స్నేహితులమయ్యాము.

ఆ మూడోనాడు అనుకుంటా, హఠాత్తుగా సెన్సే, 'యిక్కడ చాలాకాలం వుంటావా?' అని అడిగాడు.

'ఏమో చెప్పలే'నంటూ, 'సెన్సే, నువ్వో?' అని ప్రశ్నించకుండా ఉండలేకపోయాను.

‘సెన్సే’ అనేమాట నా పెదవులనుంచి బయలువెడలడం అదే మొదలు.

ఒక దేవాలయఆవరణలోని భవంతిలోఅతని బస. ఆరాత్రి అక్కడకు వెళ్ళి పిలిచాను. ‘సెన్సే, సెన్సే’అని పదే పదే పిలిచినకొద్దీ అతను విచారంగా మందహాసంచేశాడు. క్షమాపణ వేడుకుని, ‘ఇంతకుముందు నిన్ను ఎక్కడో చూసినట్టుంది గాని, ఎక్కడో జ్ఞాపకంలే’దని చెప్పాను. నావిషయంలోకూడా అతనూ ఇలానే తలపోస్తున్నాడేమో ననుకుని ఆశ్చర్యపోయాను. కాని కొంచెంసేపు ఆలోచించి సెన్సే, ‘ఊహుఁ, యింతకుపూర్వం నిన్నుచూసినట్లు అనిపించడంలేదు. పొరపడలేదుగదా?’ అన్నాడు.

## 2

కొద్దిరోజుల తరవాత సెన్సే కమలారానుంచి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయేముందు ‘ఎప్పుడయినావచ్చి నిన్నుచూడవచ్చా?’అని నేను అడిగాను. ‘సరే, రా’ నిమాత్రమే జవాబిచ్చి ఊరుకున్నాడు. ఇలా ముభావంగా జవాబివ్వడంవల్ల నాకు కొంచెం ఆశాభంగం కలిగింది. తరవాత తరవాత కూడా అతనివిషయంలో తరుచు ఆశాభంగం కలిగినా అతనిని వదిలిపెట్టాలని ఎన్నడూ బుద్ధిపుట్టలేదు. ఈ సెన్సే అంటే నా కింత మోజు ఎందుకో గ్రహించడంనా తరంకాలేదు. అతను చనిపోయేవరకు నా కీ విషయం విస్పష్టంకాలేదు.

నేను తిరిగి టోకియో వెళ్ళిన తరవాత మొదటిసారి చూడబోతే అతను యింటిలో లేడు. మళ్ళీ వెళ్ళాను. అతని

భార్య, మంచి అందగత్తె, బయటికి వచ్చి ప్రతినెలా, అదే రోజున జోషిగారియాలో ఒక సమాధిని దర్శించడానికి వెళ్ళడం సెన్నేకి అలవాటని నమ్రతతో తెలిపింది. నే నామెకు నమస్కరించి వెళ్ళిపోయి ఒక ఉద్దేశమంటూ లేకుండా, కొంతసేపు తిరిగాను. ఆ తరవాత హఠాత్తుగా జోషిగారియా వెళ్ళాలని నిశ్చయించుకున్నాను.

గోరీలదొడ్డిలోని పాకలోనుంచి బయటికి వస్తూండగా చూసి బిగ్గరగా 'సెన్నే!' అని పిలిచాను.

అతను టకీమని ఆగి నాకేసి చూశాడు.

'ఎందుకు, యెందుకు-? నావెన్నంటి వచ్చావా?' అని అడిగాడు.

అతని స్వరంలో, మొహంలో విషాదం గోచరించింది. అతని యింటికి నేను వెళ్ళడం మొదలయిన విషయాలన్నీ చెప్పాను.

'నే నెవరిసమాధిదగ్గిరికి వచ్చానో నా భార్య చెప్పిందా? అతనిపేరు యెత్తిందా?' అని అడిగాడు.

'ఉహుఁ - అదేం చెప్పలేదు' అని నేనుజవాబిచ్చాను.

చివరికి అతనికి సంతృప్తి కలిగినట్టు కనిపించింది. వీధికి చేరుకుంటూ దారిలో అనేకసమాధులు చూశాము. సమాధిఫలకాలమీది వాక్యాలనుగురించీ, బ్రతికున్నవారు వదిలి వెళ్ళిన సందేశాలలోని హాస్య వ్యంగ్యాలను గురించీ నేను యథాలాపంగా కొంత వ్యాఖ్యానించాను.

'మృత్యువునుగురించి నీవు బొత్తిగా ఆలోచిస్తున్నట్టు లేదే!' అన్నాడు చివరికి. నా నోరు నొక్కేస్తున్నట్టు అనిపించింది.

తిరిగి అతని ఇంటివైపుకి వెళుతూ మళ్ళీ ప్రశ్నించసాగాను.

'అది మీ కుటుంబానికి చెందిన స్థలమా?'

'ఉహుఁ - కాదు.'

'నీవు యెవరిసమాధి దర్శించడానికి వెళ్ళావు? మీ బంధువుదా?'

'అది నా స్నేహితునిసమాధి' అన్నాడు. అంతటితో సంభాషణ ఆగిపోయింది.

ఆ తరవాత అతనిని చూడడానికి తరుచు వెళుతూండే వాడిని. చూడడానికి వెళ్ళినకొద్దీ ఇంకా తరుచు అతనిని చూడాలని అనిపించేది. నాపట్ల అతనివైఖరి మొదటి తడవ మేము కలుసుకున్నప్పుడు ఎలా ఉందో, ఇపుడూ అలానే వుంది. ఏమీ మారలేదు. అతను ఎప్పుడూ ప్రశాంతంగా ఉండేవాడు. ఒకొక్కప్పుడు ఆ ప్రశాంతత విపరీతమయిపోయేది. అలాంటప్పుడు అతను పక్కన వున్నా నేను ఒంటరిగా వున్నట్టే ఉండేది. ఆనాడు జోషిగాయా గోరీలదొడ్డిలోనుంచి బయటికి వస్తూంటే, నేను పిలిచినపుడు అతనిమొహంలో గోచరించిన విచిత్రమయిన విషాదచ్ఛాయ అపుడపుడూ తిరిగీ గోచరించేది. కాని క్షణికం. ఆ విషాదచ్ఛాయ ఇట్టే మాయమయేది. తిరిగి యథాప్రకారంగానే ఉండేవాడు.

ఒకరోజున సెన్నేతో మాట్లాడుతూండగా ఆ సమాధిని దర్శించడానికి వెళ్ళేరోజు ఇక మూడురోజుల్లో ఉందని జ్ఞాపకంవచ్చింది.

'నీవు ఆ సమాధిని దర్శించడానికి వెళ్ళేటపుడు కూడా నేనూ రానా? నీతో కులాసాగా అక్కడివాకా నడిచి వెళ్ళాలని వుంది' అన్నాను.

'నేను ఆ సమాధిదగ్గిరికి వెళ్ళడం కులాసాగా విహరించడానికి కాదే!' అన్నాడు సెన్నే.

అతని వైఖరి విచిత్రంగా ఉంది.

కాని నేను పట్టుపట్టాను.

'కులాసాకి అయినా కాకపోయినా మరేం పరవాలేదు. నీతోకూడా తీసుకువెళ్ళు. నేనూ ఆ సమాధిని దర్శించుకుంటాను.'

సెన్నేమొహంలో కళ తప్పింది. అది ఆశ్చర్యమా? అసూయా? భయమా? ఉహుం - ఈ ఉద్వేగాలలో అది ఫలానా అని చెప్పడానికి వీలులేదు

'ఉహుం - నే నెవరినీ వెంటబెట్టుకుని ఆ సమాధి దగ్గిరకు వెళ్ళదలచుకోలేదు. కారణం చెప్పడానికి వీల్లేదు. నా భార్యనయినా తీసుకువెళ్ళను.'

నాకు ఆశ్చర్యం వేసింది. కాని అతనిజీవితాన్ని నేను తవ్వి చూడలేదు. నా మైత్రీభావంలో కొంత సంకోచమే ఉంటే, మమ్మల్ని బంధించి ఉంచిన సానుభూతి సూత్రం ఏనాడో శాశ్వతంగా తెగిపోయేది. నెలకు రెండు మూడు పర్యాయాలు అతనిని చూడడానికి వెళ్ళడం అలవాటు

చేసుకున్నాను. ఒకరోజున నేను అతనిని చూడడానికి వెళ్ళి నపుడు సెన్నే హఠాత్తుగా అడిగాడు, 'యిలాంటివాణ్ణి చూడ డానికి యెందుకు వస్తున్నావు ?'

'అబ్బే ! పెద్ద కారణం యేమీ లేదు. సరేగాని నీపను లకి అడ్డువస్తున్నానా ?'

'ఉహుఁ – అడ్డంరావడంలేదు. నాలో ఒంటరితనం బలిసింది. నీ సహచర్యం నాకు సంతోషం ఒనగూరుస్తుంది. కాని యింత తరుచుగా నన్ను చూడడానికి యెందుకు వస్తున్నావు అని అడుగుతున్నా.'

'కాని, యిటువంటి ప్రశ్న యెందుకు వేసినట్టు ?' అని అడిగాను. ఈ చర్చలో నా కేమీ అర్థం కనిపించలేదు.

సెన్నే నాకేసి ఊరికే చూసి, 'నీ వయసెంత?' అని ప్రశ్నించాడు.

తిరిగీ అతనిని చూడడానికి వెళ్ళినపుడు మళ్ళీ ఈ చర్చే వచ్చింది.

'నాలో ఒంటరితనం బలిసింది. నీలో కూడా ననుకుంటూ ! నేను పెద్దవాడిని. ప్రశాంతంగా కాలం వెళ్ళబుచ్చ గలను. కాని నీ విషయంలో అలా కాదే. యవ్వనం నిన్ను ప్రశాంతంగా మననీయదు. ఏదో ఒక పనిచేయకుండా, సాధ్య మయినంత పురోగమించకుండా ఉండలేవు'.

'అబ్బే! నాలో ఒంటరితనం లేదే?'

'యవ్వనంలో వుండగా ఒంటరిభావం మనలో తీవ్ర రూపం తాలుస్తుంది ' అంటూ కొనసాగించాడు నామాటలు వినబడనట్టు. 'నాతో కలిసిమెలిసి తిరుగుతున్నా, నీ హృద

యంలో యెక్కడో మారుమూల ఒంటరితనం దాగివుండి వుంటుంది. నీలోని ఒంటరితనాన్ని బయటికి పెరికే శక్తి నాలో లేదు. ఇంకొకరిని ఆశ్రయించడం నీకు తప్పనిసరి అవుతుంది.'

ఇలా అని అతను నవ్వాడు. ఆనవ్వులలో ఒంటరితనం ద్యోతకమయింది.

# 3

సెన్సేభార్యనిగురించీ, వారి వైవాహికజీవితం గురించీ కొంత చెప్పవలసివుంది. మొట్టమొదటిసారిగా నేను సెన్సేభార్యని చూసినపుడు ఆమె మంచి అందగత్తె అనిపించింది. ఆమెభర్తని చూడడానికి తరుచు వెళ్ళుతున్న విద్యార్థినేమో, నన్ను చాలా దయతో చూసేది. సెన్సేతో పరిచయం ఎక్కువయినకొద్దీ, నేను అపుడపుడు రాత్రిపూట భోజనానికి వారిఇంట్లోనే ఉండిపోయేవాడిని. అందువల్ల ఆమెతో సంభాషించడానికి నాకు అవకాశాలు ఎక్కువగా చిక్కాయి.

ఒకమాటు వారి ఇంటిదగ్గర నాకు తాగడానికి బియ్యపుసారా ఇచ్చారు. సెన్సేభార్య మాపక్కనేఉంది. ఆరోజున సెన్సే మామూలుగాకన్న ఎక్కువ ఉల్లాసంగా ఉన్నాడు. తాను ఒకకప్పు సారా తాగి, ఆమెకుకూడా ఒకకప్పు అందిస్తూ 'ఒకటిరెండుకప్పులు నీవుకూడా తాగు' అన్నాడు.

మనసులో ఇష్టంలేకపోయినా అంగీకరించింది.

'చిత్రం! యెప్పుడైనా నన్ను బియ్యపుసారా తాగ మని అన్నపాపానపోయావా?'

'నీకు బియ్యపుసారా అంటే యిష్టంలేదని నాకు తెలుసుగా. కాని అపుడపుడు తాగితే నీకు మంచిపనిచేస్తుంది. హుషారిస్తుంది.'

'ఉహుఁ- యేంయిచ్చిచావదు. కాని కాస్త తాగితే నీకు ఆనందం చేకూరుతుంది.'

'ఒకొక్కపుడు, యెల్లప్పుడూమాత్రం కాదు.'

'యివాళ రాత్రి తాగావుగదా, యెలావుంది?'

'యివాళ మహా ఉల్లాసంగా వుంది.'

'ప్రతిరోజూ రాత్రిళ్ళు కాస్త తాగితే?'

'ఉహుఁ - వద్దు.'

'ప్రతిరాత్రీ తాగడం మంచిది. హుషారుగావుంటుంది. నువ్వు హాయిగావుండడమే నాకు కావలసింది.'

నాకు తెలిసినంతవరకు ఈ దంపతులు అన్యోన్యంగా సుఖంగా బతుకుతున్నారు. ఆమెను పేరుపెట్టి 'షిజా' అని పిలిచినపుడు అతనిస్వరంలో కారుణ్యం ధ్వనించేది. ఆమెను వాద్యగోష్టికి, నాటకాలకు తీసుకువెళ్ళేవాడు. వారిద్దరూ కలిసి మధ్యమధ్య చిన్నచిన్న పర్యటనలుచేసి వచ్చేవారు.

కాని, విచిత్రమేమంటే, వారిఇల్లు బహుప్రశాంతంగా ఉండేది. నే నెన్నడూ ఆ ఇంటిలో కలకల నవ్వులు వినలేదు.

ఒక తడవ మేమంతాకలిసి కూర్చునిఉండగా, 'మాకు పిల్లలు ఉంటే బాగుండిపోయేది' అంది సెన్సెభార్య.

'సరే, తీసుకువస్తాను, పెంచుకుంటావా ?' అని సెన్నే అడిగాడు.

'పెంచుకోవడమా ! అమ్మో - నాకు భయం !'

'మనకి పిల్లలు పుట్టరు, పుట్టరు !'

దీని అర్థమేమిటో విప్పి చెప్పమని నేను సెన్నేని అడిగాను.

'మేము చేసుకున్న పాపం !' అన్నాడు బిగ్గరగా నవ్వుతూ.

ఇంకోసారి నేను వారిఇంటికి వెళ్ళి పిలవబోయాను. ఇంతలో కచేరీగదివైపునుంచి వారిసంభాషణ వినిపించింది. వారి స్వరాలనుబట్టి చూస్తే పోట్లాడుకొంటున్నట్టుంది. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఏంచేయాలో తోచలేదు. కాని వెంటనే ఒక నిశ్చయానికి వచ్చి నా బసకు తిరిగి వెళ్ళి పోయాను.

ఒక గంట తరవాత సెన్నే నా బసకు వచ్చి 'షికారు వెడదాం ర'మ్మని పిలిచాడు. ఆరాత్రి నేను సెన్నేతో కలిసి బీరు తాగాను. సెన్నేమాత్రం ఎక్కువగా పుచ్చుకోలేదు.

'ఇవాళేం లాభం లేదు' అన్నాడు వికటంగా నవ్వుతూ. నేను మాట్లాడలేదు.

'కొంచెంసేపుక్రితం నా భార్యతో పోట్లాడాను.'

'ఎందుకు ...?'

'నన్ను అపార్థంచేసుకుంది. ఆమె అనుకున్నలాంటి వాడినే అయితే యీ విధంగా బాధలుపడేవాణ్ణి గాను.'

మాట్లాడకుండా ఇద్దరం సాగిపోతున్నాం. నా బసకు చేరుకోగానే నన్ను లోపలకు నెట్టి, 'నీ గదికి వెళ్ళు. నేనూ తొందరగా వెళ్ళాలి. నా భార్య నాకోసం కాచుకుని వుంటుంది' అన్నాడు.

ఈ మాటలు నాకు ఉత్సాహం కలిగించాయి. ఈ భార్యాభర్తల కలహం తాత్కాలికమయిందనే గట్టి విశ్వాసంతో పడుకొని నిద్రపోయాను.

ఆ తరవాత ఒకమాటు, 'నా జీవితంలో ఒకేఒక స్త్రీని —నాభార్యనే—ఎరుగున్నా. ఇకనాభార్యకూడా ప్రపంచంలో కల్లా నేనొక్కణ్ణే పురుషుణ్ణయినట్లు భావిస్తుంది. అందుచేత మా దంపతులం సుఖపడవలసింది.' అన్నాడు.

కాని ఒక అనుమానం నన్ను బాధించింది! 'సుఖపడుతున్నాం' అనడానికిబదులు 'సుఖపడవలసింది' అని ఎందుకు అన్నట్టు?

సెన్నేవిషయంలో నాకు తెలియనివి అనేకం వున్నాయని ఇప్పుడు స్పష్టమయింది. ఉదాహరణకు: అతను ఇంపీరియల్ యూనివర్సిటీ పట్టభద్రుడని నాకు తెలుసు. కాని అతనికి స్థిరమయిన ఉద్యోగమంటూ ఉన్నట్టులేదు. అతని సహాధ్యాయులు ఏ కొద్దిమందికోతప్ప ఇంకెవరికీ అతని వూరూ పేరూ తెలియదు. అతని శక్తిసామర్థ్యాలను లెక్కచేయని ఈ ప్రపంచాన్ని చూస్తే నాకు జాలివేస్తుంది. సెన్నేకూడా, 'యీ ప్రపంచంమీద పనిచేసేశక్తిని కోల్పోయిన మనిషి'గా తనను తాను భావించుకునేవాడు.

ఒకసారి సెన్సే భార్యతో ఒంటరిగా మాట్లాడుతూ ఈ క్రింది ప్రశ్నలు వేశాను:

'సెన్సే ప్రపంచపుపను లేవీ చెయ్య డెందుచేత? జీవితంలో బాహ్యావిజయాలకోసం అన్వేషించడం వట్టి తెలివి తక్కువ అనే నమ్మకంలోకి వచ్చాడా?'

'నేను ఆడదాన్ని. ఇలాంటివిషయాలు నాకు సరిగా అర్థముకావు. కాని నీవుచెప్పిన కారణం మాత్రం కాదు.' అన్నది.

'బాగా ఆరోగ్యంగానే వున్నాడుకదా?'

'ఓ - బాగా ఆరోగ్యంగానే వున్నారు.'

'అలాఅయితే చురుకుగా యేపనీ చెయ్యడేం?'

'యేమో నాకు తెలీదు. ఆమాత్రం తెలిస్తే నే నీ విధంగా క్షోభపడేదాన్నిగాను.'

నే నేమీ మాట్లాడలేదు.

'మంచి పసుచుదనంలో' అంది హఠాత్తుగా 'యిలా వుండేవారుగాదు. ఆ తరహాయే వేరు.'

'యెప్పుడు ?'

'చదువుకుంటున్న రోజుల్లో.'

'చదువుకుంటున్న రోజుల్లో అతన్ని యెరిగున్నావా?'

ఆమె వేరే జవాబు చెప్పకుండా సిగ్గుతో తల వంచుకుంది.

# 4

వివిధవిషయాలలో తన ఆలోచనలను, భావాలను సెన్నే నాకు తెలియజేశాడు. కాని ఎన్నడూ తన వివాహ విషయం ప్రస్తావించలేదు. ఏ రమణీయమైన శృంగారగాథ వారి వివాహానికి దారితీసిందోనని నేను ఊహిస్తూండేవాడిని. ఇందులో నేను పొరబడలేదు. అంతేకాదు, సెన్నే వివాహం వెనక ఏదో భయంకరమయిన విషాధగాథ, ఏదో రమణీయ మయిన శృంగారగాథ రెండూ ఉండి ఉంటాయి.

ఒకమాటు వసంతకాలంలో సెన్నేతో మెనో వెళ్ళాను. అక్కడ రేగిచెట్లకింద ఒకరినొకరు రాసుకుంటూ నడుస్తున్న మనోహరమయిన ఒక దంపతులజంటను చూశాం.

'కొత్తగా పెళ్ళయిన దంపతుల్లా వుంది' అని సెన్నే వాళ్ళు తనకంటపడకుండా పక్కకు తిరిగాడు.

'నువ్వెన్నడూ ప్రేమలో చిక్కుకోలా?' అని నన్ను ప్రశ్నించాడు.

'ఊహుఁ –'

'ఎవరినో ఒకరిని ప్రేమించాలనిలేదూ?'

నేను జవాబివ్వలేదు.

'ప్రేమ పాపభూయిష్టమయింది!' అన్నాడు సెన్నే కొంచెంసేపు తాళి.

'ఆ విషయం నీకు తెలుసా?'

అక్కడ గుమిగూడిన జనాన్ని దాటి వచ్చేవరకు నేను మాట్లాడలేదు ఆ తరవాత 'యెందుకు?' అని ప్రశ్నించాను.

'తొందరలోనే నీకు అర్థమవుతుందిలే.' యెవరినో ఒకరిని ప్రేమించాలనే వుద్దేశంతోనే నీవు వెతుక్కుంటూ తిరుగుతున్నావు.'

'అబ్బే! లేదే!'

'నీవు నాదగ్గిరికి వస్తున్నది అందుకేగా.'

'కాని ప్రేమకీ దీనికీ చాలా తేడా వుంది, లేదూ?'

'యిది ప్రేమకి మొదటిమెట్టు. స్త్రీఆలింగనసౌఖ్యం పొందడానికి ఒకవిధమయిన సన్నాహం యిది. కాని నేను పురుషుణ్ణి, నిన్ను తృప్తిపరచలేను.... పొడుగాటి, నల్లనిజుట్టు నిన్ను పెనవేస్తూంటే యెలా వుంటుందో తెలుసా?'

'తెలుసు, భావనాప్రపంచంలో!'

'కాని, ఈవిషయం మనం ఇక కట్టిపెడదాం' అన్నాడు సేన్సే. 'కాని ఒకటిమాత్రం జ్ఞాపకముంచుకో. ప్రేమ పాప భూయిష్టమయింది. చిత్రమేమంటే ప్రేమ పవిత్రమయింది కూడానూ.'

అతని మాటలు నాకు దిగ్భ్రమ కలిగించాయి. ఆ తర వాతకూడా ఈవిషయంలో అతను చెప్పింది నాకు స్పష్టంగా అర్థంకాలేదు.

'నీ ప్రేమ యింతగా చూరగొన్నందుకు అంతరాత్మ బాధిస్తోంది.'

ఏం చెప్పదలుచుకున్నాడో!

'నన్ను నమ్మలేకపోవడంవల్లనా?'

'నేను మానవుణ్ణెవణ్ణీ నమ్మను.' అన్నాడు, దృష్టిని తోటవైపుకు మళ్ళిస్తూ.

'నీ భార్యనికూడా నమ్మవా?' అని అడిగాను, ప్రక్క గదిలో కూర్చున్న అతనిభార్యకి నా మాటలు వినిపిస్తా యనేసంగతి తాత్కాలికంగా మర్చిపోయి.

'అంతవరదాకా యెందుకు? నన్ను నేనే నమ్మను. నన్ను అట్టే నమ్మటం మంచిదికాదు. ముందే జాగ్రతపడు. యెందుకు నమ్మానా అని పశ్చాత్తాపపడేరోజు వస్తుంది నేను ద్రోహంచేశాననికూడా అనుకుంటావు.'

సెన్సేజీవితాన్నిగురించి అనేకప్రశ్నలు నాకు నేనే వేసుకున్నాను. మానవజాతిపట్ల ఇటువంటి వైఖరి ఇతనికి ఎప్పుడు, ఎలా ఏర్పడింది? అతను ఆలోచిస్తూ కూర్చునే తరహా మనిషి. ఎంతో జాగ్రతగల మనిషికి ఇంట్లోకూర్చుని ప్రపంచాన్ని విమర్శించడంవల్ల ఇటువంటి వైఖరి అలవడు తుందా? ఊహుం - స్వీయ అనుభవంద్వారా ఈ నిర్ధారణకు వచ్చివుంటాడు. ఇల్లు కాలిపోయిన తరవాత మిగిలే మొండి గోడలులాంటిది కా దీ వైఖరి. ఇది మహాబలీయమైన సంఘ టనలనుంచి జనించివుంటుంది. ఆ సంఘటనలలో అతను స్వయంగా చాలా గొప్పపాత్ర వహించి వుంటాడు. రక్తం ఉడుకెత్తిపోయివుంటుంది. ఉద్రేకం పెచ్చుపెరిగి ఉంటుంది. సెన్సే జీవితతత్వానికి మూలకందం హృదయాన్ని కదలించివేసే ప్రేమగాథ ఏదో అయివుంటుందని ఊహిం

చాను. ఆ ప్రేమగాథలో అతనిభార్యే నాయకురాలు కాదు గదా! జోషిగాయాలోని సమాధి జ్ఞాపకంవచ్చింది. అది ఎవరిదో నాకు తెలియదు. నా దృష్టిలో అది సెన్సేజీవితంలో ఒక భాగం. అతనిదృష్టిలో అది చాలా అర్థవంతమయినది. నాకో అర్థశూన్యమయినది. వట్టి సమాధి. అంతేగాదు, అది నాకూ సెన్సేకి మధ్య నిల్చిన పిశాచంవంటిదిగా నాకు గోచరించింది.

# 5

ఈవిధమయిన అనుమానాలతో నేను కొట్టుమిట్టాడుతూండగా సెన్సేభార్యతో మళ్ళీ ఒకమాటు ఏకాంతంగా మాట్లాడే అవకాశంచిక్కింది. ఆకురాలుకాలం చివరిరోజులు. పగలు అట్టే పొద్దువుండడంలేదు. సెన్సే ఇంటిచుట్టుపక్కల వరసగా మూడురాత్రులు దొంగతనాలు జరిగాయి. ఇలా ఉండగా ఒకనాటిసాయంకాలం, టోకియోకువచ్చిన ఒక మాండలికఆసుపత్రి డాక్టరు గౌరవార్థం జరిగే విందుకు సెన్సే వెళ్ళవలసివచ్చింది. చోరభయం, పుకార్లుమూలంగా సెన్సే తాను విందుకు వెళ్ళినపుడు వచ్చి ఇంటిని జాగ్రతగా చూస్తూవుండమని నన్నుకోరాడు. నేను సంతోషంగాఅంగీకరించాను.

ఆ సాయంకాలం సెన్సేఇంటికి వెళ్ళాను. అతనిభార్య నన్ను చదువులగదిలోకి తీసుకువెళ్ళి కుంపటిదగ్గిర చలికాచుకుంటూ, ఏదయినాగ్రంథం చదువుతూండమనిచెప్పి వెళ్ళిపోయింది. నేను అక్కడ పొగతాగుతూ కూచున్నాను. కాని చిరాకు వేసింది.

ఒక అరగంటలో ఆమె తిరిగివచ్చి, 'యేమిటి?' అంది నా వైఖరి చూసి ఆశ్చర్యపోతూ. 'ఇలా కూచోవడం నీకు సౌఖ్యంగావున్నట్లు లేదే?'

'అబ్బె! బాగానే వుంది'అన్నాను వినయంగా.'మనసు నంతా ఆ దొంగమీద కేంద్రీకరించాను, అంతే.'

కప్పులో ఇండియా టీ పుచ్చుకుని ఆమె నవ్వుతూ నిలబడింది

'ఈగది ఒకమూల వుండడం మూలాన దొంగకోసం కాచుకుని కూర్చోడానికి యిది తగినస్థలం కాదేమో? ఏమంటావు?'

దానిమీద ఆమె నన్ను కచేరీగదిలోకి వచ్చి టీ తాగ వలసిందని ఆహ్వానించింది. చక్కగా మెరుగుపెట్టిన కుంపటి మీద టీ కాగుతోంది. నేను రొట్టెలు తిని టీ తాగి ఆమె భర్తవిషయం ప్రసంగించడం ప్రారంభించాను.

'తరుచు యిలా బయటికి వెళుతూంటాడా?' అని ప్రశ్నించాను.

'ఊహూఁ - తరుచు వెళ్ళేవారుకారు. కాని మనుషు లంటే విముఖత నానాటికీ పెరిగిపోతోంది' అంది.

'నిన్ను ప్రేమించినక్షణంనుంచి ప్రపంచాన్ని ద్వేషి స్తున్నాడని నా విశ్వాసం.'

'నీవు పండితుడివి. వాదనలో మంచి నేర్పరివి. కాని నీవు చెప్పిన వాదనప్రకారమే, ప్రపంచాన్ని అసహ్యించు

కోవడం ప్రారంభించగానే నన్ను ద్వేషించడం ప్రారంభించా డని చెప్పగలమా?'

హఠాత్తుగా నాకు చిరాకుపుట్టింది. దీనిని గ్రహించిం దేమో ఆమె నాకు ఇంకోకప్పు టీ అందించింది. వెంటనే తీసుకుని తాగాను. కొద్దినిమిషాల క్రితం పరుషంగా మాట్లాడి నందుకు పరిహారంగా ఆమె నా మనసును రంజింపజేయాలని యత్నించింది.

'ఎంత ప్రశాంతంగా వున్నావు!' అంది.

'తిరిగీ ఆ సంభాషణ కొనసాగిద్దామా?' అని వెంటనే అడిగాను.

'సరే. కానీ.'

'నీవుగనక హఠాత్తుగా మాయమయితే పూర్వం లాగానే సెన్నే జీవించగలుగుతాడా?'

'ఈ ప్రశ్న ఆయన్నివేస్తే బావుంటుంది.'

'నీవు సెన్నేని యెంతగా ప్రేమిస్తున్నావు? ఈ ప్రశ్నకు జవాబు చెప్పగలిగింది అతను కాదు, నువ్వు.'

'జవాబు చెప్పక తప్పదా?'

'ఊఁ – తప్పదు.'

'నేను లేకపోతే నానాఅవస్థలూపడతారు. జీవించ రేమో కూడా. ఈ ప్రపంచంలో యెంత సుఖపెట్టవచ్చో అంతగా ఆయనను సుఖపెడుతున్నాను. కాకపోతే నా మా టలు అతిశయోక్తులుగా కనిపించవచ్చు.'

'నిన్ను అతను ప్రేమించడంలేదంటే నమ్మవు కదూ?' అన్నాను కాసేపు ఆడించాలని.

'అచ్చే! కాని ఆయన ప్రపంచాన్ని - కాదుకాదు - మానవజాతిని యిటీవలనే ద్వేషించడం మొదలుపెట్టారు. నేనూ మనిషినే కదూ! అందుచేత నన్ను ప్రేమించమని యెలా నిర్బంధించగలను?'

ఆమె గ్రహణశక్తిని మెచ్చుకోక తప్పదు. ఎన్నడూ నేటికాలపువారిలా మాట్లాడకపోయినా పూర్వకాలపు జపాన్ స్త్రీలలాంటిదిమాత్రం కాదు. ఇక నేనో జాగరూకతలేని యువకుడిని. స్త్రీలతో ఎక్కువ స్నేహంచేసిన అనుభవం నాకు లేదు. సెన్సేభార్యతో మాట్లాడుతూండగా స్త్రీ పురుషుల ఆలోచనలలో వ్యత్యాసం ఎంతోఉంటుందనే పరిజ్ఞానం కోల్పోయాను. అసలు ఆమె ఆడదనే సంగతే మరిచేపోయాను. సెన్సేఅంటే ప్రగాఢమయిన సానుభూతిగల నిజమయిన విమర్శకురాలిగానే ఆమెను పరిగణించాను.

'యవ్వనంలోవుండగా సెన్సే యీవిధంగా వుండేవాడుకాదని ఒకమాటు అన్నావు, జ్ఞాపకంవుందా?'

'అవును. పూర్తిగా వేరువిధంగా వుండేవారు.'

'హఠాత్తుగా యీ మార్పు యెందుకు వచ్చింది?'

గదిలో ప్రశాంతంగా ఉంది. నౌకర్ల గదిలోనుంచి ఏమాత్రం చప్పుడు వినిపించడంలేదు. దొంగను గురించిన ఆలోచనలు నా మనసులోనుంచి మటుమాయమయాయి.

'ఆయనలో యీ మార్పుకు కారణం నేనని నీవు భావించడంలేదుగదా?' అని సెన్సేభార్య హఠాత్తుగా అడిగింది.

'లేదు.'

'ఈ మార్పుకు కారణం నేనని అనిపించుకునేముందు నా తల వేయివక్కలయిపోతే బావుండును.'

కుంపటిలో బొగ్గులుసరిచేసి కెటిలులో నీళ్ళుపోసింది. నీళ్ళుపోయగానే కెటిలు బుయ్ మనడం ఆగిపోయింది.

'ఒకొక్కప్పుడు బాధభరించలేక-' కళ్ళల్లో నీరు పెట్టుకుని చెప్పింది- 'నాలో లోపమేమిటో చెప్పి సరిదిద్దమని బతిమాలేదాన్ని. కాని తనదే తప్పని ఆయన యెప్పుడూ అంటుండేవారు. నాకు విచారం నానాటికి మితిమీరిపోయి నాలో లోటేమిటో తెలుసుకోవాలనే కాంక్షతో ఏడుస్తూండే దానిని.'

ఇంతవరకు మంచిగ్రహణశక్తిగల స్త్రీ అని మాత్రమే నేను సెన్సే భార్యని మెచ్చుకునేవాడిని. ఇక ఇపుడో నేను ముగ్ధుడనయిపోయాను. సెన్సేతోటి సంసారజీవితంలో ఆమెకు చిక్కులేమీ తటస్థించలేదు. కాని ఎక్కడో ఏదో దోషం ఉంది. ప్రపంచం అంటే ఉన్న విముఖతమూలంగా సెన్సే తనను అసహ్యించుకుంటున్నాడని ఆమె అపుడపుడు భావించేది. కాని ఒకొక్కప్పుడు తనమీద ఉండే అసహ్యతమూలంగానే ప్రపంచాన్ని ద్వేషిస్తున్నాడని భావించేది. ఈ అనుమానం తనకు గుండెల్లో రాయిలాగా తయారయిందని ఆ రాత్రి ఆమె ఒప్పుకుంది.

'కాని సెన్సేకి నువ్వంటే అసహ్యం లేదు' అని పలుమారులు చెప్పాను. కాని నాకు తెలియని గొడవ ఏదో వారి వివాహంలో ఉందనే నా నమ్మకం.

ఆమె మాట్లాడలేదు. కొద్దిసేపయినతరువాత 'నిజం చెప్పాలంటే, కొంత గొడవ వుంది' అంది.

'ఈమార్పుకు సంబంధించిందేనా ?'

'ఆఁ - అవును. కాని నీతో అంతా చెప్పడానికి వీలు లేదు. ఆయన అనుమతించరు.'

ఉద్రేకంతో తొణకకుండా నిరీక్షించాను.

'సరే, ఏమిటీ?'

'విశ్వవిద్యాలయంలో చదువుతూండగా ఆయన కొక ప్రాణస్నేహితు డుండేవాడు. అతను పట్టపరీక్షకు కొద్ది వారాలముందు హఠాత్తుగా చనిపోయాడు.' అతిరహస్యంగా మళ్ళీ అంది, 'నిజానికి అతను ఆత్మహత్యచేసుకున్నాడు.'

'జోషిగాయాలోని సమాధి ఆ స్నేహితునిదేనా ?'

'అది మాత్రం చెప్పడానికి వీలులేదు. కాని ఒక విషయం చెప్పు. ప్రాణస్నేహితుడు చచ్చిపోయినంత మాత్రాన మనిషిలో అంత పెద్ద మార్పు వస్తుందంటావా?నాకు తెలుసుకోవాలని వుంది. చెప్పు.'

ఏమి చెప్పాలో నాకు తోచలేదు.

ఇంతలో ఇంటిముందు సెన్సే అడుగులచప్పుడు వినిపించింది. అతను తలుపు తెరుస్తూండగా అతనిభార్య లేచి నిలబడింది. సెన్సే మంచి హుషారుగా ఉన్నాడు.

'కృతజ్ఞుణ్ణి' అన్నాడు నవ్వుతూ. 'దొంగ దయచేశాడా ?'

సెన్సే భార్య కొన్ని రొట్టెలు పొట్లంకట్టి నా చేతికి ఇచ్చింది. వారివద్ద శలవుతీసుకుని వెళ్ళిపోయాను.

ఆ మరునాటి మధ్యాహ్నం ఆ పొట్లం విప్పి రొట్టెలు తింటూ, ఆ రొట్టెలు నాకిచ్చిన ఆ భార్యాభర్తలు ఈ ప్రపంచంలోకల్లా మహాసుఖపడుతున్న దంపతులని తలపోశాను.

ఆ ఆకురాలుకాలంలో ఆ దంపతులతో మైత్రి నానాటికీ ఎక్కువయింది. నా దుస్తులు జాగ్రతగా సర్దిపెట్టమని సెన్నే భార్యకు చెప్పేటంత అన్యోన్యత ఏర్పడింది. ఆ శీతాకాలంలో మా తండ్రిగారు మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధితో బాధపడుతుంటే ఆయనను చూసేందుకు వెళ్ళడానికి, అవసరమయిన వస్తువులు కొనడానికి కావలసినడబ్బు సెన్నే దగ్గిర అప్పుగా పుచ్చుకున్నాను.

## 6

మా తండ్రిగారు నేను అనుకున్నంత జబ్బుగా లేరు. నేను ఇంటికి చేరుకునేసరికి ఆయన పక్కమీద పద్మాసనం వేసుకుని కూర్చుని 'నయమయింది, లేచి తిరగగలను' అంటున్నారు. ఆమరునాడు పక్క తీసివేయమని పట్టుపట్టారు.

మా అన్నగారికి క్వ్యాషిన్ అనే దూరప్రదేశంలో ఉద్యోగం. మా చెల్లెలు పెళ్ళయి ఇంకోరాష్ట్రంలో నివసిస్తోంది. మా ముగ్గురిలో నేనొకడినే అందుబాటులో ఉన్నాను. తన సంతానంలో ఒకరయినా దగ్గిరఉన్నందుకు ఆయన సంతోషించారు కాని తనకు పెద్దజబ్బేమీలేదంటూ ఇంట్లో ఇష్టంవచ్చినట్లు తిరగసాగారు. జబ్బుమూలంగా వ్యాయామం పనికిరాదు. అందుకని ఎప్పుడో ప్రశాంతంగా ఉన్నరోజున తోటలోకి షికారుగా వెళ్ళడంతప్పితే బయటికి వెళ్లేవారు కాదు.

నేనూ, మా తండ్రిగారూ వెచ్చని నిప్పుగూటిమీద కూర్చుని మధ్య పరుపు, దానిమీద చదరంగంబల్లా పెట్టి ఆడే వారం. ఒకొక్కపుడు కాయలు ఎక్కడో పడిపోయేవి. మళ్ళీ ఆట ప్రారంభించినపుడే జ్ఞాపకంవచ్చేవి. తరుచుగా మా అమ్మగారు వాటిని బూడిదలోనించిపటకారుతో పైకితీసిఇస్తుం డేది. ఈ విధంగా రోజులకు రోజులు గడిపాము. మా తండ్రి గారికి పొద్దుపోతుండేదిగాని నాకుమాత్రంవిసుగెత్తిపోయింది.

అప్పుడు టోకియోనుగురించీ, సెన్సేనిగురించీ ఆలో చించసాగాను. అతనినిగురించి మా తలిదండ్రులతో అంతా చెప్పాను. సెన్సేకి ఉత్తరం వ్రాశాను. వెంటనే జవాబు వచ్చింది. నాకే ఆశ్చర్యంవేసింది. జవాబు వ్రాస్తాడని నే నెన్నడూ అనుకోలేదు. ఒకరికొకరం ఉత్తరాలు వ్రాసుకో వడం అలవాటులేదు. అతని జీవితంలో నాకు రెండేరెండు ఉత్తరాలు వ్రాశాడు. ఒకటి ఈ ఉత్తరం. రెండవది చని పోయేముందు నాకుమాత్రమే ఉద్దేశించి వ్రాసిన పెద్ద ఉత్తరం.

'ఈతడవ టోకియో వెళ్లేటపుడు ఎండు కుక్కగొ డుగులు తీసుకువెళ్ళి ఆయనకు బహూకరించు' అంది మా అమ్మ.

అందరికంటె ఎక్కువగా నా హృదయంమీద సెన్సే ప్రాభవం సంపాదించడం ఆశ్చర్యంగానే ఉంది. ఆరోజులలో సెన్సేఅధికారం నా మాంసకండరాలలోకి చొచ్చుకుపోతున్న దన్నా, అతని జీవితం నారక్తంలో ప్రవహిస్తున్నదన్నా పెద్ద అతిశయోక్తిగా ఉండేది కాదు.

కాలేజీ తెరవడానికి కొద్దిరోజులముందే బయలుదేరి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. మామాయనగారి పరిస్థితిలో పెద్ద మార్పేమీలేదని డాక్టరుగారు చెప్పాడు. ఇక అక్కడ ఉండవలసిన అగత్యం కనిపించలేదు.

# 7

వచ్చే జూనులో నేను పట్టపరీక్షకు కూర్చోవాలి. నియమావళిప్రకారం నేను ఏప్రిల్ ఆఖరులోగా నా వ్యాసం ముగించాలి చాలాకాలంవృధాపుచ్చాను. చేసిందేమీలేదు. వ్యాసరచనమీదే మనసునంతా కేంద్రీకరించాలని నిశ్చయించుకున్నాను. వ్యాసరచనకు నేను తీసుకున్న విషయం లాంటిదే సెన్సేతీసుకున్నవిషయంకూడా. అందుచేత గాబరాపడి సెన్సేదగ్గిరికివెళ్ళి ఏయేపుస్తకాలు చదవమంటావు అని సలహా అడిగాను. సెన్సేచేయగలిగిన సహాయమంతాచేశాడు. నేను వ్రాతబల్లముందుకూర్చుని విసుగూ విరామం లేకుండా పనిచేశాను. రెండోధ్యాస లేదు. ఏప్రిల్ ఆఖరున వ్యాసం ముగించిన తరవాతగాని సెన్సేని కలుసుకోవడం పడలేదు.

వేసవికాలం అప్పుడే ప్రారంభమయింది. నేను చేయవలసినపని పూర్తిఅయింది. పంజరంనుంచి తప్పించుకున్న పక్షిలాగా ఒళ్ళుతెలియని సంతోషంవేసింది.

'సెన్సే! అలా షికారుగా వెళదాం పద. బయట మహాపసందుగా వుంటుంది' అన్నాను.

మేము నగరందాటి శివార్లలో ప్రవేశించాము. కొద్ది సేపటిలో మేము కొండమీది ఒకఇంటికి చేరుకున్నాము. ఆ

ఇంటిచుట్టూ దట్టంగా చెట్లు ఉన్నాయి. తోటలోకివెళ్ళాము. అక్కడ పూలమొక్కలు పెంచి అమ్ముతారు. పియోనీమడి పక్కన బెంచీమీద కూర్చుని మా చుట్టూఉన్న ప్రకృతి రమణీయతనుగురించి ఆలోచించసాగాము.

హఠాత్తుగా సెన్సే నన్నొకప్రశ్న అడిగాడు:

'మీ నాన్నగారు బాగా వున్నవారేనా?'

'ఉహుం-ఆస్తి అట్టే లేదు.'

'ఇంకా ఎక్కువగా అడగడం మర్యాదగావుండదు గాని, అయినా ఎంత ఆస్తి వుంది?'

'కొద్దిగా భూమి వుంది. వరి పండే భూమికూడా కొద్దే. రొఖ్ఖం యేమీ లేదు.'

నా కుటుంబ ఆర్థికపరిస్థితిని గురించి ఇంతవరకు మేమెన్నడూ చర్చించలేదు. ఇప్పుడు హఠాత్తుగా ప్రశ్నించడంతో సెన్సే ఆర్థికపరిస్థితినిగురించి తెలుసుకోవాలనే కుతూహలం పైకి ఉబికింది.

'నీ సంగతేమిటి సెన్సే? నీ కేమాత్రం ఆస్తి వుంది?' అని నేను ప్రశ్నించాను.

'పెద్ద ఆస్తిపరుడిలాగా కనిపిస్తున్నానా ?'

నిజం. సాధారణమయిన దుస్తులు ధరిస్తాడు. ఇల్లూ చిన్నది. పొదుపుగా సుఖంగా బతుకుతున్నాడు.

'అవును. నా కేదో కొంత ఆస్తి వుంది. కాని భాగ్యవంతుణ్ణని అనుకునేందుకు వీలులేదు.'

సెన్సే ఆగి పేముబెత్తంతో నేలమీద సున్నాలు చుట్టడం మొదలుపెట్టాడు. హఠాత్తుగా బెత్తం నేలలో నిలువుగా పాతాడు.

'కాని ఒకప్పుడుమాత్రం నేను చాలా భాగ్యవంతుణ్ణే' అన్నాడు సెన్సే. 'అవును ఒకప్పుడు నేను భాగ్యవంతుణ్ణే' అని పునరుద్ఘాటించాడు నాకేసి చూస్తూ.

కొద్ది నిమిషాలసేపు మాతండ్రిగారి జాడ్యం గురించి మాట్లాడుకున్నాము. కాని సెన్సే తిరిగీ మా ఆస్తి విషయమే ప్రస్తావించసాగాడు.

'మీ తండ్రిగారికి వున్న ఆ కొద్దిఆస్తీ బతికివుండగానే పంచిపెట్టమని అడుగు.'

'సరే' అన్నాను సెన్సే ఇదంతా ఎందుకు చెప్తున్నాడో తెలుసుకోకుండానే.

ఆతరవాత మా కుటుంబంలోనివాళ్ళనిగురించీ, మా దగ్గరిబంధువులనుగురించీ అడిగాడు.

'అంతా నిజాయితీపరులేనా?' అని అడిగాడు తెలుసుకోవాలనే ఆకాంక్షతో.

'నిజాయితీపరులు కానివారంటూ యెవరూ వున్నట్లు లేదు' అన్నాను. ఇప్పటికీ అతనిధోరణి నాకు అర్థంకాదు.

'స్వభావసిద్ధంగా దుర్మార్గులయివుంటారనుకున్నావా? జనులు సామాన్యంగా అంతా మంచివాళ్ళే. కాని హఠాత్పరిస్థితులు వారిని దుర్మార్గులుగా మార్చేస్తాయి.'

ఎక్కడో దగ్గరలోనే కుక్క మొరిగింది. ఒక చిన్న పిల్లవాడు మాదగ్గిరికి వచ్చాడు.

'మీ రిక్షాడికి వచ్చినపుడు మాయింట్లో యెవరూ కనపడలేదా?' అని అడిగాడు. కళ్ళల్లో సంతోషం తొణికిస లాడుతోంది.

'ఇక్కడ కాసేపు విశ్రాంతి తీసుకుంటామని మీ అమ్మగారితో చెప్పు' అని సెన్సే పర్సు బయటికితీసి అయిదు సెన్లనాణెం కుర్రవాడిచేతిలో పెట్టాడు.

కాని మా సంభాషణకు అంతరాయం కలిగింది. వెళ్ళి పోదామని లేచాము. సెన్సే కోటువీపు దులిపాను. నాకు కృతజ్ఞతాభి వందనాలు తెలిపాడు.

'ఈ కోటు కొత్తది. మొన్ననే నా భార్య కుట్టింది. మాసిపోతే చివాట్లుపెడుతుంది.'

ఆ ఇంటిపక్కగా వెళుతూంటే ఆ ఇంటి యజమాను రాలు, ఇంకో బాలిక వరండాలో నూలు కండెలకు చుట్టుతూ కనిపించారు. వారికి నమస్కరించి పనికి అంతరాయం కలిగిస్తు న్నందుకు క్షమించమని వేడుకున్నాము.

'అబ్బే! మమ్మల్నేమీ యిబ్బంది పెట్టడం లేదు లెండి' అని ఆమె కొడుకుకి బహుమానం ఇచ్చినందుకు సెన్సేకి కృతజ్ఞత తెలిపింది.

కాని గేటుదాటామో లేదో, వెనకటి సంభాషణమీది ఆలోచనలు నన్ను ముంచెత్తివేశాయి.

'మనిషిని దుర్మార్గుడిగా మార్చే హఠాత్పరిస్థితిని యేమంటావు?' అనిఅడిగాను తెలుసుకోవాలనేకుతూహలంతో.

'డబ్బు!' అన్నాడు సెన్సే నవ్వుతూ.

'డబ్బు! అయితే యిక చెబుతా విను. నన్ను మోస గించేశారు. నా రక్తబంధువులే నాకు ద్రోహంచేశారు. ఎన్నటికీ మరిచిపోలేను. కాని యింకా వాళ్ళమీద పగ తీర్చుకోనేలేను. అయితే ఆ వ్యక్తులమీద పగకంటే యెక్కువే సాధిస్తున్నాననుకుంటున్నాను. వాళ్ళనొక్కళ్ళనే ద్వేషించడంలేదు. వారు ప్రాతినిధ్యంవహించే మానవజాతినే అసహ్యించుకుంటున్నాను.'

సెన్నేని పరామర్శించాలనికూడా నేను యత్నించలేక పోయాను.

శివార్లలో బస్సుఎక్కి నగరంలో దిగాము. సెన్నే మళ్ళీ పూర్వంలాగానే హుషారుగా కనిపించాడు. అతని మొహంలోకి చూశాను. కళ్ళల్లోగాని పెదవులమీదగాని ఏమాత్రం మానవద్వేషం గోచరించలేదు. మరి అతనిహృద యంలో ఏమూల అది దాగిఉందో!

కాని మాసంభాషణ పూర్తికాలేదేమో, నన్ను బాధ పెట్టసాగింది. ఇలా బాధపడడం ఇది మొదటసారి కాదు. ఆలోచనాభాగంలో నేనతనికి ఎంతో రుణపడిఉన్నాను. అతని అనుభవాలనుగురించి ఎడతెగని మూగనోముపట్టడం వల్ల మా సంభాషణ కొంతదూరం వెళ్ళి టపీమని ఆగిపో యేది. కొద్దిరోజుల తరవాత కలుసుకున్నప్పుడు ఈ సంగతి చెప్పేశాను.

'అబ్బే! పొరబడ్డావు. నేను నీదగ్గిరేమీ దాచడం లేదే!' అన్నాడు సెన్నే.

'ఉహుఁ - దాస్తున్నావు.'

'దాచవలసిన అగత్యం లేదు. నీవు అసలు విషయాన్ని గందరగోళపరుస్తున్నావు.'

'నీఅభిప్రాయాలు అనుభవంవల్ల జనించినవి. అందుకే వాటికి నే నెంతో విలువయిస్తున్నాను. ఒకదానితో ఒకటి పొందుపరిచి చూడకుండా విడివిడిగా చూస్తే వాటి విలువ కనిపించదు. ప్రాణంలేని బొమ్మను చేతిలో పెట్టి నన్ను ఓదార్చాలనిచూ స్తేమాత్రం లాభంలేదు.

సెన్నే ఆశ్చర్యంతో నా కేసి పారజూచాడు. చేయి, చేతిలోని సిగరెట్టు వణికిపోయాయి.

'నీవు మంచిధైర్యస్తుడివే.'

'ఉహుం - జీవితంనుంచి కొంత నేర్చుకోవాలని మన సారా వాంఛిస్తున్నాను. అంతే.'

'నా గతచరిత్ర రచ్చకెక్కినా సరేననేగా!'

'రచ్చకెక్కడం' అనేమాట మహా ఘోరమయిన మాట. మాట్లాడకుండా అతని కేసి చూశాను.

'నీవు ద్రోహమంటే తెలియని అమాయికుడిలాగా వున్నావు' అన్నాడు సెన్నే. 'మరణించేముందు యెవరినో ఒకరిని విశ్వసించాలని నేను అనుకుంటున్నాను. ఆ మనిషివి నీవేనా?'

అతను దీర్ఘంగాఆలోచిస్తున్నట్టున్నాడు.

'సరే సరే' అన్నాడు చివరికి. 'సరే, నీతో చెపుతాను. కాని- ఉహుం - సరే. సరే. నీకు ఇదేమీ ఉపయోగించదు. యిపుడు చెప్పలేను. జ్ఞాపకంవుంచుకో, సమయంవచ్చినపుడు చెపుతాను. యిపుడు కాదు.'

# 8

నేను పట్టపరీక్షలో కృతార్థురాలనయినరోజున సెన్సేతో భోజన మారగించాను. నే ననుకున్నంతగా నా వ్యాసాన్ని ప్రొఫెసర్లు మెచ్చుకోలేదు. అయినా నేను పరీక్షలో కృతార్థురాలనయాను.

వడ్డన అయింది. బల్లమీద పరిచిన ముతకగుడ్డ తెల్లగా పరిశుభ్రంగా ఉంది. అప్పుడే ఉతికి, ఇస్త్రీచేశారు. ఈ విషయాలలో సెన్సేకి పట్టుదల ఎక్కువ.

సెన్సే, సెన్సేభార్యా నన్ను అభినందించారు.

'మీ అమ్మా, నాన్నా ఎంతో సంతోషిస్తారు' అంది.

ఈ మాటలతో హఠాత్తుగా మాతండ్రిగారు జ్ఞాపకం వచ్చారు. ఇంటికి త్వరగా వెళ్ళి నా పటా వారికి చూపించా లని నిశ్చయించుకున్నాను.

'సెన్సే! నీ పట్టా యేదీ?' అని నేను ప్రశ్నించాను.

'నాదా!' అన్నాడు ఆశ్చర్యంతో. భార్యవంక తిరిగి 'యెక్క డుందో నీకు తెలుసా?' అని అడిగాడు.

'యెక్కడో వుండాలి' అని ఆమె సమాధానమిచ్చింది.

ఆ పట్టా ఎక్కడ ఉందో ఆ భార్యాభర్తలిద్దరికీ తెలియదు. ఆ విషయంలో వారికి శ్రద్ధా లేదు.

భోజనానంతరం ఐస్క్రీము తింటూండగా పట్టభద్రుడ వయావుగదా, ఇక యేమిచేయదలచావని సెన్సే నన్ను అడిగాడు. బడిపంతులు ఉద్యోగం చేస్తావా? లేకపోతే గవర్నమెంటుఉద్యోగం చేస్తావా? అని సెన్సేభార్య అడిగింది.

'నిజం చెప్పాలంటే' అంటూ ప్రారంభించాను. నవ్వుతూ. 'నా కే వుద్దేశమూ లేదు. దేనికి పనికివస్తామో ఒకమాటు యత్నించిచూస్తేనేగాని తెలియదు. అంతేనా?'

'అది నిజమేగాని నీకు కొద్దోగొప్పో ఆస్తి వుంది కాబట్టి కులాసాగా తిరగగలవు. నీవు బీదవాడివి అనుకో! అప్పుడు యింతసేపు ఆలోచించేవాడివా?'

'బహుశా సెన్నేప్రభావం నాకుకొంతతగిలివుంటుంది.'

'అయితే చెడిపోయావన్నమాటే!'

'మీరు బాగా వున్నవాళ్ళేగా?' అని నేను అడిగాను.

ఆమె మందహాసంచేసి భర్తకేసి చూసింది.

'అబ్బే! మాకు యెక్కువగా యేంలేదు' అంది.

'సుఖంగా జీవించాలంటే యేమాత్రం వుంటే సరిపోతుందో తెలుసుకోవాలని అడిగాను. అంతే.'

అని నా అభిప్రాయం విశదీకరించాను.

'మాకు ఎక్కువగా యేంలేదు. ఏదో జీవనానికి తగినంత వుంది. నీవుమాత్రం ఏదో ఒకపని చేసితీరాలి. సెన్నేలాగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే ప్రయోజనం లేదు.'

'అబ్బే! నేను గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోడంలేదే!' అన్నాడు సెన్నే.

పదిగంటలయింది. బయలుదేరాను. రెండు మూడు రోజులలో నా స్వగ్రామం చేరుకోవాలి.

'కొద్దినెలలదాకా నిన్ను కలుసుకోలేననుకుంటాను' అన్నాను.

'సెప్టెంబరులో తిరిగి వస్తావుగా. రావూ ?'

'ఆc - వద్దామనే అనుకుంటున్నా.'

'సరేగాని, మీ తండ్రిగారికి యెలా వుంది?' అని సెన్సే అడిగాడు.

మామూలుగానే ఉందని నేను జవాబిచ్చాను.

'వారివిషయంలో బహు శ్రద్ధవహించాలి.' అంది సెన్సే భార్య. 'ఆ జాడ్యమే గనక మెదడుకు పాకితే, మాటలేం కాదు'

చాలాకాలం క్రితం జాడ్యంతోనే మరణించిన ఆమె తల్లి జ్ఞాపకంవచ్చిఉంటుంది.

హఠాత్తుగా సెన్సే ఆమెకేసి తిరిగాడు.

'షిజా ! నాకంటే ముందు నీవు చనిపోతావనుకుంటున్నావా ?'

'యెందుకు ? ,

'యేమో నాకే తెలీదు. ఆశ్చర్యంవేస్తోంది. భర్తముందు పోతాడని అంటారు. కాదూ?'

'నీవు మంచి బలంగానే వున్నావు. యెపుడూ జబ్బు చేసినట్లు లేదు. నేనే ముందు చనిపోతాను.'

'కాని నేనే ముందు పోయాననుకో, అపుడు నీవేం చేస్తావు ? '

ఆమె తటపటాయించింది. ఈ ప్రశ్న ఆమెలో విచారం రేకెత్తించింది. కానివెంటనే కోలుకొని,

'అబ్బే ! నేనేం చెయ్యలేను. చెయ్యగలనంటావా ?' అంది ఆషామాషీగా.

నేను వారి సంభాషణ వింటూ కూర్చున్నాను. నాకేసి తిరిగి అంది:

'సెన్నే తల్లీ తండ్రీ ఒకమాటే చనిపోయారు.'

'ఆవిధంగా చనిపోవడం యెలా సంభవించింది?' అని నేను అడిగాను.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పబోతుండగా సెన్నే అడ్డువచ్చి, 'పిజా! చనిపోయేటప్పుడు ఈ యిల్లు నీకు ఇచ్చి మరీ చనిపోతాను' అన్నాడు.

'భూమి యివ్వవా ?'

'ఊహుఁ - వీలుపడదు. అది నాదికాదని నీకు తెలుసుగా. కాని నాకున్న సర్వస్వమూ నీ కిచ్చి మరీపోతాను.'

'సరే. కృతజ్ఞురాల్ని. కాని నీ విదేశీ పుస్తకాలు మాత్రం నాకు వద్దు. యేంచేసుకోను ?'

'పాతపుస్తకాలు అమ్మేవాడికి అమ్మేయవచ్చు.'

'అమ్మితే యేమాత్రం వస్తుంది ?'

ఆమె నవ్వింది. కాని ఈవిషయంమీద చర్చ కొనసాగినకొద్దీ ఆమెకి విచారం ఎక్కువవుతోంది. సెన్నే ఇది కనిపెట్టి వెంటనే ఈ విషయం కట్టిపెట్టేశాడు.

నేను వారిదగ్గిర శెలవుతీసుకుని బయలుదేరాను.

'మళ్ళీ సెప్టెంబరులో కలుసుకుందాం' అన్నాడు సెన్నే.

వారితోటలోని ఆలివుచెట్ల దట్టమయిన కొమ్మల కిందుగా నడిచివెళ్ళాను. సువాసనగుప్పుమంటోంది. ఆరోజునే నాతోపాటుపరీక్షలో కృతార్థుడయిన ఒక స్నేహితుని కలుసుకుని, పానశాలలోకి వెళ్ళి అర్ధరాత్రివరకు అక్కడే గడిపాను.

# 9

ఆ మర్నాడు నాకు కావలసిన వస్తువులు కొనుక్కున్నాను. మా అమ్మగారి ఆదేశంప్రకారం తళతళా మెరిసే బద్దీల చవుకబారు సూటుకేసు కొని, బహుమతులు తదితర వస్తువులతో దానిని నింపాను. కొద్దిరోజులతరవాత టోకియో నుంచి బయలుదేరాను. మా తండ్రిగారి జాడ్యంగురించి ఆలోచించాను. మా అమ్మగారిని తలుచుకుని విచారపడ్డాను. సెన్సెఇంటిలో ఆఖరుసారి భోజనానంతరం జరిగిన సంభాషణ జ్ఞాపకంవచ్చింది.

'యెవరు ముందు, యెవరు వెనక?' ఈ ప్రశ్నకు జవాబేగనక తెలిస్తే మనం ఏమిచేస్తామా అనుకుని ఆశ్చర్య పోయాను.

బహుశా ఏమీచేయమని నిర్ధారణ చేసుకున్నాను. యథాప్రకారం జీవితం గడుపుతాము, అంతే.

# కో కొ రో

## రెండో భాగం

*నా తలిదండ్రులు - నేను*

నేను ఇంటికి చేరుకున్నాను. మా తండ్రిగారిలో మార్పేమీ కనిపించకపోయేసరికి ఆశ్చర్యంవేసింది. ఆయన పాత గడ్డిహేటు పెట్టుకుని తోటలో ఏదో పనిచేస్తున్నారు.

'ఓ - వచ్చావా!' అని సంతోషంతో చేతులు కడుగు కోవడానికి వెళ్ళారు.

నేను పట్టభద్రుడ నయినందుకు ఆయన బహిరంగంగా చూపిన సంతోషానికి నాకే సిగ్గువేసింది.

'నీవు పట్టా పుచ్చుకున్నావు. నా కెంతో సంతోషంగా వుంది' అని పదేపదే అన్నారు. నేను పట్టపరీక్షలో కృతార్థుడనయినరోజు సాయంకాలం అభినందించినపుడు సెన్సే మొహంలోని కవళికతో మా తండ్రిగారి కళ్ళలోని సంతోషాన్ని సరిపోల్చకుండా ఉండలేకపోయాను. అంతూ పొంతూలేని మా తండ్రిగారి ఆనందంలోకంటె సెన్సే మాట్లాడకుండా మొహంలో చూపిన నిర్లక్ష్యంలో ఏదో గొప్ప దృక్పథం ఉన్నట్టు నాకు తోచింది.

'ప్రతి సంవత్సరం వందలకొలది పట్టాలు పుచ్చుకుంటూంటారు' అన్నాను నేను.

కొడుకు పట్టా పుచ్చుకోవడం తండ్రికి ఎంత ఆనంద దాయకంగా ఉంటుందో నాకు విశదీకరించి చెప్పాలని మా తండ్రిగారు యత్నించారు. నా మనసు మెత్తపడింది. నాభావాలకు నాకే సిగ్గువేసి సూటుకేసులోనుంచి నా పట్టా తీసి చూపించాను. అది నలిగిపోయి అసలు ఆకారం కోలు పోయింది.

'చేతిలో పట్టుకుని తీసుకువస్తే బావుండిపోయేది' అన్నారు మాతండ్రిగారు.

'యెవరయినా మెత్తటి వాటిల్లో పెట్టి కట్టినట్టయితే బావుండేది' అంది మా అమ్మ.

ఇద్దరూ దానిని సరిచేసి గర్వంతో దానికేసిచూశారు. అందరికీ కనిపించేటట్టు మా తండ్రిగారు గూటి మధ్యగా పెట్టారు.

మా తండ్రిగారి పరిస్థితినిగురించి మా అమ్మగారితో తరవాతగాని ఒంటరిగా మాట్లాడడానికి వీలుచిక్కిందికాదు.

'బాగా ఆరోగ్యంగావున్నవారిలాగా తోటలో పని చేస్తున్నారు' అన్నాను తీవ్రంగా.

'అవును. ఆయ నేమీ బాధపడుతున్నట్టులేదు. కాని ఆయనకి యెంత తోస్తే అంత. పట్టుదల యెక్కువ. కాస్త ఆరోగ్యం బాగున్నట్టు తోస్తే, నా మాట విననేవినరు.'

మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధినిగురించి నాకు తెలిసినదంతా చెప్పాను. ఎలా పరిణమిస్తుందో ఎవరూ చెప్ప లేరు అనికూడా చెప్పాను. కాని ఆమెకు అర్థమయినట్టులేదు.

అందుచేత సరాసరి మా తండ్రిగారి దగ్గిరికే వెళ్ళి ఆయన వ్యాధిని గురించి స్పష్టంగా చెప్పివేశాను.

'అవును. నీవు చెప్పింది బాగానేవుంది. కాని ఈశరీరం నాది, యింకెవరిదీ కాదు. నాకు అనుభవం యెంతో వుంది. అందుచేత దీనిని యెలా కాపాడుకోవాలో అందరికంటె నాకే యెక్కువ తెలుసు' అన్నారు.

'చూశావా, చూశావా! అంది మా అమ్మ.

'ఆరోగ్యం బాగానేవుందని మనసులో అనుకుంటారు. యింకా పదో యిరవయ్యో యేళ్ళు బతుకుతాననే ఆయన నమ్మకం.

విశాలమయిన ఈ పాతఇంటిలో ఒంటరిగా మా అమ్మ! ఎలా ఉంటుందో ఊహించాలని యత్నించాను. ఒంటరిగా ఈ ఇంటిలో మాఅమ్మ ఉంటుంటే నేను టోకియోలో ఉంటే నా మనసుకు శాంతి ఉంటుందా? అనుకుని ఆశ్చర్యపోయాను.

కాని మాఅమ్మ ఎక్కువగా కుంగిపోయినట్టు కనిపించలేదు. నాతలిదండ్రుల మనసు ఇతర విషయాలమీద లగ్నమయి ఉంది. నేను పట్టభద్రుడనయిన సందర్భం పురస్కరించుకుని ఇరుగుపొరుగువారికి విందుచేయాలనే ఆలోచనలో ఉన్నారు. ఆ విందులో తప్పకుండా సెకిహాన్ (ఎర్రచిక్కుడితో బియ్యం ఉడకబెట్టిచేసే వంటకం ఎరుపు తెలుపు రంగులు శుభ సూచకాలు) వండిపెట్టాలని వారిఊహ. ఈ విందుకు అభ్యంతరం తెలుపుతూ పెద్ద గొడవేమీ చేయవద్దని బతిమాలాను. నాకు ఈ పల్లెటూరివారికి విందు

చేయడమంటే అసహ్యం. వీళ్ళు విందుకు రావడమల్లా అయినకాడికి తినడానికి తాగడానికి. పైగా వారు ఆశించినట్టు చేయకపోతే నోటికివచ్చినట్టు తిట్టడానికి వీళ్ళు వెనకాడరు.

'పట్టా పుచ్చుకోవడమనేది జీవితంలో మళ్ళీ జరిగేదా పెట్టేదా?' అని మా అమ్మ నా మాటలకు అసమ్మతి తెలిపింది. పట్టాపుచ్చుకోవడం, పెళ్ళిచేసుకోవడం – ఈ రెండూ మా అమ్మ దృష్టిలో ఒకవిధమయినవే.

'యిది పల్లెటూరు. ఇక్కడికి టోకియోకి చాలా వ్యత్యాసం వుంది' అన్నారు మా తండ్రిగారు.

'అపవాదు తప్పించుకోవడానికి విందుచేయాలంటారా, అది వేరేవిషయం' అన్నాను నేను.

'నీ హేతువాదంతో నా దుంపతెంపుతున్నావు' అన్నారు మూతి ముడుచుకుంటూ. 'చదువు యెక్కువయిన కొద్దీ వాదించడంకూడా యెక్కువవుతుంది.'

ఇప్పుడేకాదు మొదటినుంచీ నన్నుగురించి మా తండ్రిగారు ఇలా అంటూనే ఉండేవారు. అందుచేత ఇక వాదించి లాభంలేదని నిశ్చయించుకున్నాను. ఆ రాత్రే ఆలోచించి విందుచేయడానికి నిర్ణయించాం.

కాని ఆరోజుననే ఒక గొప్పసంఘటన జరిగి మా ఆలోచనలన్నీ గాలికి ఎగిరిపోయాయి. చక్రవర్తి మెయిజీకి జబ్బుచేసింది.

'మనం విందుమానుకోవడం మంచిది' అన్నారు మా తండ్రిగారు.

# 2

పనీపాటా లేకపోవడంవల్ల ఏమీ తోచలేదు. పుస్త కాలు బయటికితీసి చదవనారంభించాను. తరుచు చేతిలో పుస్తకంపెట్టుకుని కునికిపాట్లుపడి కీటకసంగీతానికి మేలుకునే వాడిని. స్నేహితులకు ఉత్తరాలు వ్రాశాను. ఇక సెన్నేకి మూడు కాగితాలమీద దగ్గిరదగ్గిరగా ఉత్తరం వ్రాశాను. సెన్నే, అతనిభార్యా లేని సమయంలో ఇంటిని జాగ్రత్తగా చూడడానికి వచ్చే మనిషికి నా ఉత్తరం వారికి పంపాలనే తెలివి, కనికరం ఉంటుందా అనుకున్నాను. నాలో ఒంటరి తనం ఎక్కువయింది. జవాబు వస్తే బాగుండిపోను. కాని రాలేదు.

మా తండ్రిగారికి చదరగంమీద అయిష్టతఏర్పడింది. చక్రవర్తిగారికి జబ్బుచేసిందనే వార్త విన్నదగ్గరనుంచీ ఏదో దీర్ఘాలోచనలో పడిపోయారు. ప్రతిరోజూ వార్తాపత్రిక కోసం ఎదురుతెన్నులు చూసి ముందుగా చదివేవారు.

'యివాళకూడా దేవుని కుమారుని ఆరోగ్య పరిస్థితిని గురించి సవివరంగా రాశారు' అంటూండేవారు.

మొహంలో విషాదమేఘాలు తారాడేవి.

'యిలా పోల్చుకోవడం సాహసమే అనుకో. అయినా నా జబ్బూ ఆ మహారాజుగారి జబ్బూ ఒకటే ! కాదూ?'

మా అమ్మగారు ఆయనను ఎంతో ఆదుర్దాతో కని పెట్టి చూసింది.

'నిజంగా భయపడిపోయినట్లే వున్నారు. ఇంకా పదో యిరవయ్యో యేళ్ళు బతుకుతాననే ఆశ వున్నట్లు లేదు.' అంది మా అమ్మ. 'మళ్ళీ చదరంగం ఆడమని పురి గొల్పరాదూ.'

కాని ప్రయోజనం లేకపోయింది. క్రమేపీ శక్తి ఉడిగి పోసాగింది. పాత గడ్డిపోటు మూలపడింది.

చక్రవర్తిగారి నిర్యాణవార్త వినగానే, నేను సన్నటి నల్లకుడ్డ కొని, దానితో స్టీమరు చేసి జండాస్తభం పై భాగంలో కట్టాను. గేటుదగ్గర జండా సగానికి కింద దింపాను. గేటులోనుంచి బయటికివెళ్ళి ఆ నల్లగుడ్డకేసి, తెల్ల రవసెల్లా మీాది ఉదయభానుని తేరిపారజూచాను. ఆ తరవాత పత్రిక చదువుతూ 'తండ్రిని' కోల్పోయిన ఆటోకియో నగరంలో ఆనాటి వాతావరణం ఎలా వుందో ఊహించసాగాను. ఆ నగరంమధ్య చిమ్మచీకటిలో బింబుప్రకాశంలాగా సెన్సే ఇల్లు నా భావనాప్రపంచంలో గోచరించింది.

# 3

ఒక పల్లెటూరిలోని మాధ్యమికపాఠశాలలో పంతులు ఉద్యోగం ఖాళీగా ఉందని తెలియజేస్తూ ఒక స్నేహితుడు నాకు ఉత్తరం వ్రాశాడు. ఆ ఉద్యోగాన్ని నిరాకరిస్తూ నే నా స్నేహితునికి జాబువ్రాసి ఆ సంగతి నా తలిదండ్రులకు చెప్పాను. వారు నాతో ఏకీభవించారు.

'అంతకంటె మంచి ఉద్యోగమే దొరకవచ్చు. అటు వంటి బడిలో వుద్యోగంచెయ్యడమేమిటి!' అన్నారు.

కొత్తగా పటా పుచ్చుకున్నవారి అర్హతకుమించిన ఉద్యోగం, జీతం నాకు లభించాలని నా తలిదండ్రులు ఆశిస్తు న్నట్టు స్పష్టమయింది. అతిగా ఆశించడం మంచిదిగాదని సున్నితంగా వారికి తెలియజేయాలని యత్నించాను.

'నీ రెండోకొడుకు పట్టాపుచ్చుకుని యేంజేస్తున్నా' డని నలుగురూ అడిగితే యేం చెప్పేది?' అన్నారు మా తండ్రిగారు.

పుట్టినప్పటినుంచీ అక్కడ నివసిస్తున్న ఆ ప్రజల భావాలనుంచి మా తండ్రిగారి భావాలను వేరుచేయడం సాధ్యంకాదు. నా తలిదండ్రులదృష్టిలో తలకిందులుగా నడిచే విచిత్రజంతువును నేను. మామధ్య తేడా చాలా ఉంది. ఒకరిభావాలు ఒకరికి రుచించవు.

'నీవు యెపుడూ చెపుతూంటావే, ఆయనను యీ విషయం అడగరాదూ' అని సూచించింది మా అమ్మ.

'ఆయన యేం చేస్తుంటాడు?' అని అడిగారు మా తండ్రిగారు.

'అబ్బే, యేమీ చెయ్యడంలేదు' అని నేను చెప్పాను.

'యేమిటీ, యేమీ చెయ్యడంలేదూ?' అన్నారు మా తండ్రిగారు. 'నాకు జీతంభత్యం లేకపోయినా వూరికే కూర్చోలేనే!'

'ఆయనకి వుత్తరం రాయరాదూ?' అంది మా అమ్మ.

తాను చనిపోయినతరవాత అమ్మగతి ఏమవుతుందో నని బెంగపెట్టుకున్నారు మా నాయనగారు. బిడ్డలంతా ఎక్కడో దూరాన నివసిస్తుంటే ఆమెఒక్కతే పల్లెటూరులో

ఎలా ఉంటుందోనని ఆలోచించసాగారు. చదువుమూలంగా పిల్లలు తలిదండ్రులకు దూరమయిపోతారని తీవ్రంగా నిరసించారు. మా అమ్మ ఈ ఇంటిలోతప్ప ఇంకెక్కడయినా హాయిగా ఉండగలదని ఆయన ఎప్పుడూ తలపోసినట్టులేదు. కాని ఆయన నేను టోకియోలో మంచి ఉద్యోగంలో చేరాలని ఆదుర్దాపడుతున్నారు.

మాఅమ్మ సూచించినట్లు సెన్సేకి జాబువ్రాసి జవాబుకోసం నిరీక్షించాను. వారంరోజులు గడిచాయి. జవాబు లేదు.

'యెక్కడయినా చల్లని ప్రదేశంలో వేసంగి గడపడానికి వెళ్ళారేమో?' అన్నాను ఆందోళనతో.

కాని సెప్టెంబరులో నేను టోకియో వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. టోకియోలో ఏదయినా ఉద్యోగం దొరికే వరకు కొంతకాలంపాటు నాకు డబ్బు పంపుతూండమని కోరాను.

'సరే, అలాగే' అన్నారు మాతండ్రిగారు. 'కాని యెల్లకాలము పంపుతుంటానని మాత్రం అనుకోకు. నిజానికి యీరోజుల్లో పడుచు కుర్రాళ్ళకి డబ్బు ఖర్చుపెట్టడం యెలాగో బాగా తెలుసు. అసలు డబ్బుసంపాదించాలనేఆలోచనే వున్నట్టు కనిపించదు.'

ఆయన రోగిష్టి మనిషి, అందుకని మాటాడకుండా చెప్పిందల్లా విన్నాను.

'మీ అమ్మని పంచాంగంచూసి ప్రయాణానికి మంచి రోజు నిర్ణయించమను.' అని మళ్ళీ దీనంగా, 'నీవు వెళ్ళిపోతే యిల్లు చిన్నబోతుంది.' అన్నారు.

సూలో - సూలో - బోషి (ఒకవిధమయిన కీటకం) ఝుమ్మంటూ మాచుట్టూ రాగాలుతీయడం మొదలుపెట్టింది. ఈ కీటకం వేసవి ఆఖరున బయలుదేరుతుంది. అంటే వేసవి రావడం, పోవడం జరిగిందన్నమాట! ఎలా జరగవలసి ఉన్నదో, అలా జరుగుతుంది. జీవితం యథాప్రకారం సాగి పోతూనేఉంటుంది.

కాని ఈ విశాల ప్రపంచంలో మనకు తెలియనివి ఎన్నో ఉన్నాయి. నేను బయలుదేరుదామనుకున్నరోజుకు రెండు మూడు రోజులముందు మా తండ్రిగారికి మళ్ళీ మూర్ఛవచ్చింది. ఆయన స్నానంచేయడానికని స్నానాల గదిలోకి వెళ్ళారు. వీపు రుద్దడానికి వెళ్ళిన మా అమ్మ హఠాత్తుగా నన్ను కేకవేసింది. మా తండ్రిగారిని మెల్లగా సావిడిలోకి తీసుకువచ్చాము. అమర్నాడు బాగానేఉన్నారు. గాని డాక్టరుగారుమాత్రం చాలా జాగ్రతగా చూస్తూఉండా లని హెచ్చరించారు. నేను ప్రయాణం మానుకున్నాను.

రెండు మూడు రోజుల తరవాత మా నాయనగారు మళ్ళీ మూర్ఛపోయారు. కదలకుండా పక్కమీద పడుకోవా లని డాక్టరు ఆదేశించారు. కాని ఆయన జబ్బుమనిషిలా కనిపించలేదు. ఆకలి బాగానే ఉంది. ఎండు బియ్యపురొట్టె చేయించుకుని కమ్మగా తిన్నారు.

'యేంచెయ్యాలి!' అని గొణిగింది మా అమ్మ ఏమీ చేయలేక. 'యింత ఆకలి యెలా వేస్తోందో ఆశ్చర్యంగావుంది.'

మా నాయనగారిని చూడడానికి మా బాబాయి వచ్చారు. తననుఇష్టంవచ్చినట్టు తిననీయడంలేదని ఆయనతో గొడవచేశారు మా నాయనగారు.

నేను మా అన్నగారికి ఉత్తరం వ్రాశాను. మాఅమ్మ మాచెల్లెలికి జాబువ్రాసింది. మాచెల్లెలు గర్భిణితోఉంది. పట్టణంలోని ఆసుపత్రి నర్సుని మా తండ్రిగారికి ఉపచారం చేయడానికి నియోగించాము.

# 4

మా తండ్రిగారి అరోగ్యం ఎలాఉందో విచారించడానికి వచ్చిన స్నేహితులతో బంధువులతో మాఇల్లు కిటకిటలాడిపోయింది; గాని ఆయన ఆరోగ్యంలో మార్పేమీ కనిపించలేదు. ఎపుడయినా కనిపించినా అది చెడుకే దారితీసేది. ఒకొక్కపుడు మృత్యువు సమీపిస్తున్నదనే పరిజ్ఞానమే ఆయనకు ఉన్నట్టులేదు.

'నేను కోలుకున్నతరవాత టోకియో వెళ్ళొస్తాను' అన్నారు ఒకమాటు.

'మీరు టోకియో వెళ్ళేటప్పుడు నన్నూ మీతో కూడా తీసుకువెళ్ళండి' అంది మాఅమ్మ ఉల్లాసంగా ఉన్నట్టు నటించడానికి యత్నిస్తూ.

లేకపోతే ఆయన కుంగిపోతారు.

'నేను చచ్చిపోతే, మీ అమ్మనిజాగ్రత్తగా చూడండి' అనేవారు అటువంటి సమయంలో.

ఈముక్కే సెన్సే అతనిభార్యతో ఆ ఆఖరిరోజు భోజనానంతరం అన్నట్టు నాకు జ్ఞాపకంవచ్చింది. 'నేను చచ్చిపోతే' అని సెన్సే అనగానే ఆమె చెవులలో వేళ్ళుదోపుకుంది. అప్పుడు అదంతా ఊహ. ఇక్కడ ఇప్పుడో మృత్యుదేవత నిజంగా మాచుట్టూ తిరుగుతూ భయపెట్టుతోంది.

నా పుస్తకాలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి. వాటి మధ్య కూర్చుని ఈ వేసవికాలంలో ఏమీ చేయలేకపోయానే అని చింతిస్తూండగా మాఅమ్మ వచ్చి నా పక్కన కూర్చుంది.

'సెన్సేదగ్గరనించి వుత్తరం ఏమీ రాలేదా?' అని అడిగింది.

నేను తలఅడ్డంగాఊపాను. నామీదా నాకోరికమీదా అసహ్యంపుట్టి సెన్సే ఉత్తరాలు వ్రాయడంమానుకున్నాడని నాకు అనుమానంవేసింది.

'మళ్ళీ ఉత్తరం వేసిచూడు' అంది మాఅమ్మ.

'నేను టోకియో వెళ్ళి స్వయంగానే ప్రయత్నించాల్సి వుంటుంది' అన్నాను నేను.

'మీనాన్నగారి వంట్లో యిలావుంటే యెలా వెళతావు?' అని మెల్లిగా తనలోతాను 'ఆయన బ్రతికి వుండగానే ఏదయినా వుద్యోగంలో నీవు స్థిరపడితే యెంతో సంతోషిస్తారు అనుకుంది.

మాఅమ్మ నాయనగారికి ఏవిధంగాను అడ్డువచ్చేది కాదు. ఆయన ఇష్టంవచ్చినట్టు కాలం వెళ్ళబుచ్చనిచ్చేది.

'నాయనగారిని పత్రిక చదవనీయకండి' అన్నాడు మాఅన్న.

'పత్రిక చదవాలని ప్టుపడతారు. మనం ఆపాలని చూసి లాభంలేదు ' అన్నాను నేను.

మా తండ్రిగారు నిజానికి బాగా ఆరోగ్యంగా, హుషారుగా ఉన్నట్టు కనిపించారు.

'యిప్పటి పరిస్థితినిబట్టి, మరేం పరవాలేదు. చాలా రోజులు బతుకుతాడనే తోస్తోంది' అన్నాడు మా బావ.

మా తండ్రిగారిస్థితి ఈవిధంగా ఉండగా టోకయోకి బయలుదేరి రమ్మని సెన్సెదగ్గరనుంచి నాకు తంతి వచ్చింది. మా నాయనగారిని వదిలి వెళ్ళడానికి వీలులేదు. మా అమ్మగారితో సంప్రదించి అప్పుడు రాలేనని తెలియజేస్తూ సెన్సెకి తంతి ఇచ్చాను. పరిస్థితులను విశదీకరిస్తూ పెద ఉత్తరం కూడా వ్రాశాను.

'యిది నీ వుద్యోగానికి సంబంధించిదయివుంటుంది. దురదృష్టం !' అంది.

రెండురోజులతరవాత నేను రానవసరంలేదనీ అంతా సవ్యంగానే ఉందనీ తెలుపుతూ సెన్సె ఇంకో తంతిఇచ్చాడు.

# 5

పట్టణఆసుపత్రి ప్రధానవైద్యుడు మా తండ్రిగారిని పరీక్షించడానికి వచ్చారు. ఆయనా, మామూలుగా మా తండ్రిగారికి వైద్యంచేస్తున్న వైద్యుడు సంప్రదించుకుని పురీషనాళఇంజక్షను ఇవ్వాలని నిర్ణయించారు.

మా నాయనగారి ఆరోగ్యం కుదటపడడంలేదని స్పష్టమయిపోయింది. గ్రహణశక్తి నానాటికి తగ్గిపోతోంది.

తెలియకుండానే పక్కలో మలమూత్రాదులు విసర్జిస్తున్నారు. ఆకలి మందగించింది. ఆయనకి పత్రిక చదవాలని కాంక్ష ఎక్కువ. అదీ తీసి చదివే శక్తి ఉడిగిపోయింది. నల్లటి కేసులో కళ్ళజోడు తలగడాపక్కన అలానే ఉండిపోతోంది. ఇక ఏమాత్రం రోగం విషమించినా మరణం తథ్యమనేస్థితి వచ్చింది. ఏ అర్ధరాత్రివేళ ఆయన ఆయుర్దాయం ఆఖరయి పోతుందో అనే భీతితో ఇంటిల్లిపాదీ పక్కలమీద వాలు తున్నారు. ఎందుకయినా మంచిదని ప్రతిరాత్రీ వంతులువేసు కుని ఎవరమో ఒకరము ఆయనపక్కన కూర్చుంటున్నాము. మా తండ్రిగారి వ్యాధిమూలంగానేగాక, మాలో ప్రతివారికీ ఏదోఒక చింత వేధిస్తూనేఉంది.

'యేం చేయదలిచావు ?' అని మా అన్నగారు ప్రశ్నించారు నాకు రాబోయే ఉద్యోగాన్ని దృష్టిలోపెట్టుకుని.

'నాన్నగారు ఈ ఆస్తిఅంతా యెలా సంబాళిస్తున్నారా అని ఆశ్చర్యపోతున్నాను,'అని అన్నాను. కాని నామనసు మాత్రం వేరే విషయాలమీద పనిచేస్తోంది.

'నీ స్నేహితుడి దగ్గరనించి ఇంకా వుత్తరం రాలేదా?' అని మా అమ్మ పదే పదే అడగసాగింది.

టోకియోలో సెన్సే, నాకోసం ఏమి ఉద్యోగం చూస్తున్నాడో తెలుసుకోవాలని మాఅమ్మకిఆదుర్దాగాఉంది.

'యెవరీ సెన్సే ?' అని మాఅన్నగారు అడిగారు.

సెన్సేని గురించి చెప్పాను. అటువంటి స్వభావంగల మనిషి ఎలాఉంటాడు తనకు అర్థంకావడంలేదన్నారు మా అన్నగారు.

'అహంకారంగల మనిషంటే నాకు సరిపడదు. ఏదో ఒకటి చెయ్యకుండా బతకడం స్వార్థం అనిపించుకుంటుంది' అన్నారు.

మా తండ్రిగారి పరిస్థితి నానాటికీ విషమిస్తోంది. పచ్చటి ద్రవపదార్థం కక్కసాగారు. అంటే ఆఖరి ఘడియలు సమీపిస్తున్నాయన్నమాట ! అందుచేత మా సంభాషణ కుటుంబవ్యవహారాలకు పరిమితమయిపోయింది.

'టోకియోనుంచి వచ్చేసి కుటుంబవ్యవహారాలు చూడాలని నీకు లేదా?' అని మా అన్నగారు ప్రశ్నించారు.

ఈ పల్లెటూరిలో, ఈ పొలాలమధ్య పడిచావమని చెప్పడానికి నోరెలా వచ్చిందో!

'నిజానికి నీవూ వచ్చివుండాల్సింది' అన్నాను నేను.

అది సాధ్యంకాదని మా అన్నగారు చెప్పారు. ఇందులో సహాయంచేయమని మా బాబాయిని అడగడం మంచిదని అనుకున్నాము. కాని మా అమ్మ ఈ ఇల్లు వదిలి పెట్టి వెళ్ళడానికి ఒప్పుకుంటుందా?

ఈవిధంగా అన్నదమ్ములం ఇద్దరం మా తండ్రిగారు బతికిఉండగానే ఆయన చనిపోయినతరవాత చేయవలసిన ఏర్పాట్లనుగురించి వాదించుకోసాగాము.

# 6

మా తండ్రిగారిస్థితి మరీ విషమంగా ఉండగా సెన్నే దగ్గరనుంచి నాకు ఉత్తరం వచ్చింది. మా తండ్రిగారికి సంధిం చడంమూలాన మేమందరం సాధ్యమయినంత ఎక్కువసేపు ఆయనదగ్గిరే ఉంటున్నాము. 'ఒమిట్సూ యేదీ?' అంటూ మాటిమాటికీ అడగసాగారు. ఒకొక్కపుడు మాట్లాడకుండా మా అమ్మకేసి తేరిపారజూచేవారు. ఎంతో వాత్సల్యంతో ఆమెతో మాట్లాడి మాకు ఆశ్చర్యంగొలిపేవారు. 'ఒమిట్సూ! నన్నెంతో దయతో చూశావు' అనేవారు. త్వరలోనే ఆయనకి మైకం కప్పేసింది. నాలుక క్రమేపీ కొయ్యబారిపోయింది. తలమీద మంచుగడ్డ సంచి పెట్టి నిరీక్షిస్తూ కూర్చున్నాను.

ఆ సమయంలో మా అన్నగారు సెన్సేఉత్తరం పట్టు కుని నాదగ్గిరికి చక్కావచ్చారు. ఉత్తరం మామూలు కంటే ఎక్కువ బరువుగా ఉంది. పైగా రిజిష్టరు చేయబడింది.

చాలా సేపటివరకు మా తండ్రిగారిని వదిలి అవతలికి వెళ్ళడానికి వీలులేకపోయింది. ఎలాగయితేనేం చివరికి కొద్ది నిమిషాలసేపు అవతలికి వెళ్ళగలినపుడు గట్టిగాఉన్నకవరు కాగితం చింపిపారేశాను. ఉత్తరం సుదీర్ఘంగా ఉంది. ఆసాం తం చదవడం సాధ్యంకాలేదు. అక్కడక్కడా చదివి చూశాను గానిఏమీబోధపడలేదు. మానాయనగారి అంతిమ ఘడియలు సమీపించాయని నాకు తెలుసు. సెన్సే ఉత్త రంలోని ఆ ముక్కా ఈ ముక్కా కలిపి అర్థంతీయాలని యత్నిస్తూ నిలబడ్డాను. మళ్ళీ మా నాయనగారి గదిలోకి పరు

గెత్తుకుంటూ ఇంజక్షను ఇవ్వడంలో డాక్టరుకి సాయపడి తిరిగీ ఉత్తరం చేత పుచ్చుకున్నాను.

ఏదో విపరీతమయిన భయం నన్నావహించింది. తొందరలోనే మా అన్నగారు పిలుస్తారు. మా నాయనగారి అంతిమఘడియలు వచ్చి ఉంటాయి అనుకున్నాను. ఉత్తరం లోని పంక్తులు నాకళ్ళకి కనిపిస్తూనేఉన్నాయి. కాని మాటలు మనసులోకి ఎక్కడంలేదు. ఆఖరిపుట వచ్చేవరకు యాంత్రికంగా పుటలు తిప్పాను. ఉత్తరం కింద పెట్టేద్దా మనుకుంటూంటే పుటచివరవాక్యం నాకంటపడింది. 'యీ వుత్తరం నీకు చేరేసరికి, యీ ప్రపంచంలో నేను వుండను. చనిపోయి వుంటాను.'

ఉత్తరంవంక చూశాను. గుండె గడ్డకట్టుకుపోయిన ట్లనిపించింది. ఏమయినా బోధపడుతుందేమోనని పుటలు మళ్ళీ మళ్ళీ తిరగవేశాను. సెన్సే బతికి ఉన్నాడా లేదా? ఈ ప్రశ్నకు సమాధానం కావాలి.

నేను మా తండ్రిగారిగదిలోకి వెళ్ళాను. ఆయన శయ్యాపక్కన అంతా ప్రశాంతంగా ఉంది. ఇంజక్షను పుచ్చుకున్నతరవాత కొంచెం నయంగా ఉన్నట్లుంది. ఆయనదగ్గర నుంచి వెళ్ళి రైళ్ళ రాకపోకల పట్టిక చూశాను. సెన్సే ఉత్తరం చేతితో పట్టుకుని డాక్టరుగారిఇంటికి పరుగెత్తాను. మా తండ్రిగారు ఇంకా రెండు మూడు రోజులు బతికే ఆశ ఉందో లేదో కనుక్కుందామనీ, నేను తిరిగివచ్చేవరకు ఏదోవిధంగా ఆయనప్రాణం నిలబెట్టమని చెపుదామనీ అనుకున్నాను. కాని డాక్టరుగారు ఇంటిలో లేరు. ఆయన

కోసం నిరీక్షించకుండా స్టేషనుకు తొందర తొందరగా రిక్షాలో బయలుదేరాను.

పరిస్థితిని విశదీకరిస్తూ మా అమ్మకీ, అన్నగారికీ చీటీ వ్రాసి మా ఇంటిలో ఇవ్వవలసిందని రిక్షావాలా చేతికి ఇచ్చాను. ఇక ఆతరవాత టోకియో వెళ్ళే రైలులో వెళ్ళి పడ్డాను. మూడవతరగతి పెట్టెలో గందరగోళంలో సెన్సే ఉత్తరం తీసి ఆసాంతం చదివాను.

# మూడో భాగం

సెన్సే - అతని ఆఖరి వుత్తరం.

ఈ వేసంగిలో నీవు వ్రాసిన రెండు మూడు ఉత్తరాలు అందినాయి. వాటిలో ఒకదానిలో ఏదయినా తగిన ఉద్యోగం చూపించమని వ్రాశావు. కాని ఆ విషయంలో నేనేమీ చేయలేదు. ఎవరికీ వ్రాయనూ లేదు. నిజం చెప్పాలంటే నీ ఉద్యోగవిషయం నాకు ముఖ్యమనిపించలేదు. నా స్వవిషయంలో, నా భవితవ్యంలో మునిగిపోయి ఉన్నాను. చాలా ముఖ్యమయిన విషయంలో చిక్కుకున్నాను ఏమి చేయాలి? చచ్చుపీనుగలాగా ఈ జీవితాన్ని ఇలా కొనసాగించడమా లేక......ఆ ఆలోచనను పూర్తి చేయలేక పోయాను. నేను వట్టి పిరికివాణ్ణి. కాని అందరు పిరికివాళ్ళ లాగానే నేనూ నరకయాతన అనుభవిస్తున్నాను. నీకు ఉత్తరం వ్రాయకపోయినందుకు క్షమించు నీ క్షమాపణకోసమే నేను సమస్తమూ చెప్పేస్తున్నాను. ఈ ఉత్తరం చదివితే నీకు సర్వమూ బోధపడుతుందనే నమ్ముతున్నాను.

రావలసిందిగా నీకు తంతి ఇవ్వడంకూడా స్వార్థమే. నిన్ను కలుసుకుని, మాట్లాడి, నన్నుగురించి నీకు తెలుపుదామనుకున్నాను. కాని మీనాన్నగారికి జబ్బు ఎక్కువగా ఉందని ఎలా మర్చిపోగలను? పైగా వారిని జాగ్రత్తగా

చూడవలసిందని సలహా ఇచ్చింది నేనేనాయను! ఇదే నా స్వభావంలోని వైరుధ్యం. నేను స్వార్థపరుడనని నాకు తెలుసు. అందుకే నా స్వార్థాన్ని క్షమించమని నిన్ను వేడుకుంటు న్నాను.

కిందటి తడవ నీవు వ్రాసిన ఉత్తరానికి జవాబు రాద్దా మనుకొని మళ్ళీ మానుకున్నాను. నీకు ఉత్తరం వ్రాస్తే ఇందులోని విషయాలే వ్రాయాలి. అప్పటికి దానికి ఇంకా సమయం రాలేదు.

జహాజులో పుట్టిన లక్షలాది జనంలో నీ ఒక్కడికే నా గతజీవితాన్ని తెలియజేయాలని వాంఛిస్తున్నా నన డంలో ఎట్టిసందేహమూ లేదు. నీవు నిజాయితీపరుడివి. జీవితా న్నుంచి సజీవమయిన గుణపాఠం శ్రద్ధగా నేర్చుకోవాలని నీవు చెప్పావు జ్ఞాపకంఉందా? ఈ కారణాల వలననే నీకు నావిషయం తెలియజేస్తున్నాను. ఏమాత్రం దాయకుండా నా జీవితకీనీడలను నీ మీద ప్రసరింపజేయబోతున్నాను. భయపడవద్దు. ఆధ్యాత్మిక అంధకారంవంక తేరిపారజూచి నీకు ఉపయుక్తమయినది గ్రహించు. నా హృదయాన్ని నేనే నాశనంచేసుకోబోతున్నాను. నా రక్తాన్ని నీ రక్తనాళా ల్లో పోయబోతున్నాను. నా గుండెకాయ కొట్టుకోవడం ఆగిపోయేసరికి నీ హృదయంలో నూతనజీవం ప్రవేశిస్తే సంతోషిస్తాను.

# 2

నా తలిదండ్రు లిద్దరూ చనిపోయేసరికి నాకు ఇరవయి ఏళ్ళు. మా తండ్రిగారికి భయంకరమయిన విషజ్వరం సోకింది. ఉపచారంచేసిన మా అమ్మగారికికూడా అది అంటుకుంది. వారికి నే నొక్కడనే కొడుకుని. అందుకని నన్ను అల్లారుముద్దుగా పెంచారు. నా తలిదండ్రులు పోగానే నా సంరక్షణబాధ్యత మా బాబాయిగారు వహించారు. నా ఆస్తినంతా అప్పగించుకుని, నన్ను సంరక్షిస్తూ, నేను కోరినట్లు చదువుకునేందుకు టోకియో పంపించారు. టోకియోలోని ఉన్నతపాఠశాలలో ప్రవేశించాను. నాకు ఏ కొరతా లేదు. నా నిత్యఖర్చులకే కాకుండా పుస్తకాలు కొనుక్కోడానికి తదితరఖర్చులకు డబ్బు ఉండేది. ఇతరవిద్యార్థులు నన్ను జూచి అసూయపడేవారు.

నేను మా బాబాయిని పూర్తిగా నమ్మాను. అంతేగాదు ఆయనంటే గౌరవభావం, కృతజ్ఞతాభావం నాలో ఏర్పడింది. ఆయన అత్యాశాపరుడు. ఒకమాటు మండల శాసనసభలో ప్రతినిధిగా పనిచేశారు. మా నాయనగారికంటె చిన్నవాడేగాని వారిద్దరికి స్వభావంలో ఎంతో తేడా ఉంది. మా తండ్రిగారు సుగుణవంతులు. పెద్దలదగ్గిరనుంచి సంక్రమించిన ఆస్తిని జాగ్రతగా కాపాడుకుంటూవచ్చారు. పుష్పోపచయం, టీపార్టీలు ఆయనసరదాలు. అంతేకాదు; చిత్రాలు, చిత్రవస్తువులు అంటే అభిరుచి ఎక్కువ. మంచి ఆస్తిపాస్తులు, అభిరుచులు గలవారు. పల్లెటూరు పెద్దమనిషి.

ఇక మా బాబాయో పట్టణవాసి, వ్యవహర్త. మంచి నమ్మ కస్తుడు, సమర్థుడు అని మా నాయనగారు మా బాబాయిని గురించి అంటూండేవారు.

వేసంగి శెలవులకు మాఊరు వచ్చేసరికి మాబాబాయి, ఆయనభార్య యజమానులులాగా నాఇంటిలో నివసిస్తు న్నారు. ఈవిధమయిన ఏర్పాటు ఇదివరకే జరిగింది. పట్టణం లోని వివిధసంస్థలతో మా బాబాయికి సంబంధం ఉండడం వల్ల అక్కడకూడా ఒకఇల్లు తీసుకున్నాడు. ఈవిధమయిన ఏర్పాటుకు నాకు చాలా సంతోషమయింది. నా ఇల్లు నా కిందే ఉంచుకుని శెలవులకు వచ్చిఉండాలని నా అభిలాష. అది నా ఇల్లు

నేను ఇంటికి చేరుకునేసరికి మా బాబాయి కుటుంబ మంతా అక్కడే ఉంది. నన్ను ఎంతో సంతోషంతో ఆదరిం చారు. నా తలిదండ్రులు నివసించినప్పటికన్న ఇప్పుడు ఇల్లు కళకళలాడుతూండడం నా కెంతో ముచ్చటయింది. నా తలి దండ్రుల స్మృతికి సంబంధించినవిచారంతప్ప మరేవిచారమూ లేకుండా శెలవులు గడిపి తిరిగీ టోకియో వెళ్ళాను. మా బాబాయి, ఆయనభార్య నన్ను పెళ్ళిచేసుకోమన్నారు. అదొక్కటే శాస్త చింతించవలసిన విషయం. వారు నన్ను పెళ్ళిచేసుకోమనేసరికి మొదట ఆశ్చర్యపోయాను. కాని పదే పదే ఆవిషయమే ఎత్తేసరికి వారిమాట వినడానికి నిరాకరిం చాను. సాధ్యమయినంత త్వరలో తిరిగివచ్చి భార్యతోకలిసి ఇంటిని జాగ్రత్తపెట్టుకుంటావనే ఉద్దేశంతో ఈ సూచనచేశా నని మా బాబాయి చెప్పారు.

మొదటిసంవత్సరం చదువు పూర్తిచేసుకుని నేను ఇంటికి తిరిగిరాగానే మళ్ళీ పెళ్ళివిషయం తీసుకువచ్చారు. ఈ తడవ పెళ్ళికుతురినికూడా సిద్ధంచేశారు. ఆ పెళ్ళికూతురు ఎవరో కాదు, మా బాబాయికూతురే! ఆపిల్లను పెళ్ళిచేసుకుంటే రెండు కుటుంబాలకి అనుకూలంగా ఉంటుందనీ మా తండ్రిగారుకూడా బతికిఉన్నప్పుడు ఈ ముక్క అంటూండేవారనీ మా బాబాయి చెప్పాడు. మా నాయనగారికి అటువంటి ఉద్దేశం ఉండవచ్చని గుర్తించాను. మా బాబాయి అభిలాష యుక్తమయిందనీ గ్రహించాను. కాని ఈ సంబంధం చేసుకోవాలని బుద్ధిపుట్టలేదు. మా బాబాయికూతురు, నేను స్నేహంగా మెలగడమే దీనికి కారణమయిఉండవచ్చు. మా బాబాయిఇంటిలో నేను ఆయనకొడుకులా పెరిగాను. అక్కచెల్లెళ్ళవరసలో ప్రేమ ఏపరిస్థితిలోనూ పుట్టదని నీకు తెలిసిందేగా. తరుచుగా కలుసుకుంటూ అతిస్నేహంగా తిరిగే స్త్రీ పురుషులలో ప్రేమకు అవసరమయిన ఆకర్షణను కలిగించే కొంగ్రొత్తదనం నశించిపోతుంది. ధూపం వెలిగించగానే వచ్చే సువాసననే మనము ఆనందించగలము. సాకే మొదటిగుక్క అతి రుచిగా ఉంటుంది. అలాగే ప్రేమోద్రేకంలో ఒక సందిగ్ధదశ ఉంటుంది. ఆ దశ క్రియారూపం పొందకుండా దాటిపోయిందా తరుచు కలుసుకుంటున్నకొలదీ ప్రేమోద్రేకం క్రమక్రమంగా చల్లారిపోతుంది. అప్పుడు స్నేహంమాత్రమే వృద్ధిఅవుతుంది. ఈసంబంధం నిరాకరించకుండా చేసేదేమీ కనిపించలేదు. మా బాబాయికి కష్టం

వేసింది. నాకు ఆ పిల్లమీద ఎంత ప్రేమ ఉందో, ఆపిల్లకు నామీద అంతే ప్రేమ. అయినా ఏడవటం మొదలుపెట్టింది.

నేను అమాయకుడినేమో, చేసుకోనని నిష్కర్షగా చెప్పివేస్తే అంతటితో ఈ వ్యవహారం సమసిపోతుం దనుకు న్నాను. మళ్ళీ వేసంగిశెలవులకు ఇంటికి వచ్చాను. మా బాబాయి వైఖరిలో మార్పువచ్చింది. పూర్వంలాగా ఆప్యా యంగా నన్ను చూడడం మానివేశారు. ఆయన ఒక్కరేకాదు ఆయనకుటుంబమంతా నా విషయంలో మారిపోయారు. కారణం తెలియక ఆశ్చర్యపోయాను. అసలు వారిలో మార్పు వచ్చిందా లేకపోతే నాలో మార్పు వచ్చిందా? అప్పుడు వారు నాకు వేరువిధంగా కనిపించసాగారు, నేను స్పష్టంగా ప్రపంచాన్ని చూడగలిగేటట్టు నా తలిదండ్రులు నాకళ్ళు తుడిచారో లేదో? నాదృష్టిలో ప్రపంచం పూర్తిగా మారిపో యింది. నాకు పదిహేను పదహారు సంవత్సరాలప్పుడుకూడా ఇలాగే జరిగింది. అప్పుడు ఒకరోజున హఠాత్తుగా ఈ ప్రపం చంలో సౌందర్యం ఉందని కనుగొన్నాను. సౌందర్యానికి ప్రతినిధులుగా నాకు స్త్రీలు కనిపించారు. ఆ వయసులోనే స్త్రీపురుషులలో లైంగికజ్ఞానం ఉదయిస్తుంది. బహుశా ఈ మార్పుకు కారణం అదేనేమో!

## 3

ఇంతవరకు మా బాబాయికి పూర్తిగా అప్పగించిన నా ఆస్తికి సంబంధించిన వివరాలను తెలుసుకోకపోవడం నా తలిదండ్రులకు అపచారం చేయడంగా నేను భావించాను.

ఆ వివరాలు అడిగేసరికి మా బాబాయి ఆందోళన పడు తున్నట్లు కనిపించారు. ఎప్పుడు అడిగినా తీరుబడిలేదని చెపు తూండేవారు. దీనినిబట్టి ఎలాగయినా ఈ విషయం చర్చకు రాకుండా తప్పించడానికి సాకులు చెపుతున్నారని నాకు తోచింది.

మా బాబాయినిగురించి కొత్తకొత్త విషయాలు నాకు తెలియవచ్చాయి. పట్టణంలో ఆయన కొక ఉంపుడుగత్తె ఉందట. ఒకప్పుడు దివాలాతీయడానికి సిద్ధమయిన ఆయన, గత రెండు సంవత్సరాలనుంచి హఠాత్తుగా సిరితో తుల తూగుతున్నాడనీ తెలిసింది. మా బాబాయి ప్రవర్తన విషయంలో నాకు నిజంగానే అనుమానంవేసి నా ఆస్తి విషయంలో రాయబారాలు సాగించాను. 'రాయబారాలు' అనే పదం చిత్రంగానూ, కఠినంగానూ ఉండవచ్చు. కాని దానిని ఇంకోమాటలో చెప్పడం ఎలాగో నాకు తెలియ లేదు. మాబాబాయి ఇంకా నన్ను పసిపిల్లవాడిని చూసినట్టే చూడసాగారు. నేనుమాత్రం సందేహదృష్టితో ఆయనను ఎదుర్కొన్నాను. అందుచేత చర్చ చాలాకాలంపట్టింది.

ఇలా చాలాకాలం జరిగినచర్చావివరాలు నేను తెలుపలేను. మా బాబాయి ఆస్తివిషయంలో నన్ను మోసం చేశాడని నేను గ్రహించానని చెప్పితే చాలు ననుకుంటాను. పరిస్థితులప్రభావంవల్ల నిజాయితీపరులుకూడా ఒకొక్కప్పుడు దగాకోరులుగా తయారవుతారని ఒకసారి నీతో అన్నాను. జ్ఞాపకం ఉండేఉంటుంది. అప్పుడు నేను మాబాబాయివిషయమే ఆలోచిస్తున్నాను. మోసం గ్రహించగానే నాముందు రెండే

మార్గాలు గోచరించాయి. ఒకటి: మోసానికి మాట్లాడకుండా తలఒగ్గడం; రెండు: బహిరంగంగా మా బాబాయి మీద చర్యతీసుకోవడం. చాలాకాలం ఆలోచించి చిక్కిందేమిటో తీసుకుని మెదలకుండా ఊరుకుందామని నిశ్చయించుకున్నాను. ఒక స్నేహితుడి సహాయంతో మిగిలిన ఆస్తి అమ్మి రొఖ్ఖంచేసుకుని టోకియోకి వెళ్ళిపోయాను. బయలుదేరే ముందు నా తలిదండ్రుల సమాధులు దర్శించాను. తరవాత మరెప్పుడూ వాటిని నేను దర్శించలేదు.

సుఖంగా జీవించడానికి కావలసినంతడబ్బు నాదగ్గర ఉంది. ఎపుడూ గందరగోళంగా ఉండే హాస్టలు వదిలిపెట్టి స్వంతఇల్లు ఒకటి చూసుకోవాలని నిశ్చయించుకున్నాను. అనువయిన ఇల్లుకోసం వెతుకుతూ ఒకరోజున నేను హాంగో కొండదిగువనుంచి పశ్చిమంగా కోయిషికావా సులోబీపైగా డెన్జూయిన్ వైపుకి నడిచివెళ్ళాను. దారిలో ఒక రొట్టెల దుకాణదారునిభార్య కనిపించి నెలకు ఇంతని ఇస్తూ ఏదయినా ఒకకుటుంబంలో అతిథిగా వుండడం మంచిదనీ, ఒక అధికారి చనిపోయాడనీ, ఆయనభార్య ఒకే ఒక కూతురుతో నివసిస్తూందనీ, ఆవిడ నన్ను డబ్బుచెల్లించే అతిథిగా సంతోషంతో స్వీకరిస్తుందనీ చెప్పింది. వెంటనే నేను వెళ్ళి ఆ విధవరాలితో మాట్లాడాను. అనేక విషయాలు గుచ్చి గుచ్చి నన్ను అడిగి, అప్పటికప్పుడే నన్ను డబ్బుచెల్లించే అతిథిగా తీసుకోవడానికి నిశ్చయించింది. ఆమె గుణవంతురాలుగా, నిజాయితీపరురాలుగా కనిపించింది. ఆమె అంటే నాకు ఇష్టం ఏర్పడింది.

# 4

వెంటనే నేను బస మార్చేశాను. ఇంటిలోని గదులలోకెల్లా మంచిగదిని నాకు ఇచ్చారు. ఆ గదిలో గూడు గాక రెండు బీరువాలున్నాయి. వరండాకి ఎదురుగా 6 అడుగుల పొడవుగల చిన్న కొట్టు ఉంది. అయితే కిటికీ అంటూ ఒకటీ లేదు. గదిముందున్న వరండాగుండా వెలుతురు గదిలోకి ప్రసరిస్తుంది.

గూడులో కొత్తపువ్వులు, గోడకిఆనించి ఒక కోటో (సంగీతజంత్రం) కంటపడేసరికి నాకు చికాకు వేసింది. గూడులో వేలాడగట్టాలని నేను కొన్ని పటాలు తీసుకువచ్చాను. ఈ ఏర్పాట్లన్నింటివెనకా స్త్రీహస్తం గోచరిస్తోంది. ఆ యింటి యజమానురాలి కుమార్తెను చూడాలని నాకూ కుతూహలంకలిగింది. రూపంలో, నడతలో అచ్చంగా తల్లిలాగానే ఉంటుందని మనసులో ఊహించుకున్నాను. కాని ఆమెను మొదటిసారిగా చూసేసరికి తబ్బిబ్బయిపోయాను. అప్పటివరకు నే నూహించలేకపోయిన స్త్రీ పరిమళాలగాలి నా మనసులో వీవజొచ్చింది. ఆ తరవాత ఇంకేముంది గూడులో పువ్వులఏర్పాటు నాకు ఏవగింపు కలగజేయలేదు. కోటో నన్ను చికాకుపర్చలేదు.

పుష్పాలను ఎప్పటికప్పుడు మార్చేవారు. కాని వాటిని కూర్చడంలోమాత్రం నేర్పు కనిపించలేదు. పైగా రకంమార్పులేదు. పూలకూజా మార్చడంలేదు. కోటో ఆమె వాయించడంకూడా ఇంతే. ఎవరిచెవులోనో ఊదుతున్నట్లుం

డేది ఆమె పాడుతుంటే. అందుచేత ఆమెపాటకూడా నే నెన్నడూ సరిగా వినలేదు. కాని సరిగాకూర్చుని ఆ పువ్వులు చూసి, సరిగాపాడనిపాటను విని నేను ఆనందించాను.

మొదట ఆ ఇంటిలో నాకు స్థిమితంచిక్కలేదు. నిరాశాభావంతో నేను ఇంటినుంచి బయలుదేరాను. మా బాబాయితో, ఆయన భార్యతో కలిగిన అనుభవం ప్రజా నీకంఎడ నా వైఖరిని మార్చేసింది. వారిబారినుంచి కాచు కోవాలనే ఎప్పుడూ నా ఆరాటం. నా హృదయం విచార మగ్నమయింది. సీసపుముద్ద మింగినంత భారంగా ఉంది. ఈ ఇంటిలో ప్రవేశించినతరవాత అలసట తగ్గలేదు. ప్రాత బల్లముందు కూర్చుని పిల్లి ఎలుకను కనిపెట్టి చూస్తున్నట్టు ఆ ఇంటిలోనివారిని నేను కనిపెట్టి చూడసాగాను. దొంగ తనం చెయ్యని దొంగలా ఉన్నానని గుర్తించి నన్ను నేనే అసహ్యించుకోసాగాను. అతిజాగ్రత్తగా వారిని కనిపెట్టి చూశాను. కాని ఆ ఇంటి యజమానురాలికూతురుమీద నాకు ఆసక్తి కలిగింది. ఇది విరుద్ధంగా కనిపిస్తుంది. నేను డబ్బు విషయంలో ఏమానవుణ్ణీ నమ్మను. ప్రేమను అనుమా నించడం ఇంతవరకు ఎరగను.

నేను ఆ ఇంటి యజమానురాలిని ఒకుసాన్ (యజ మానురాలు) అని పిలిచేవాడిని. ఆమె నన్ను చాలా నెమ్మ దస్తుడనీ ఉదారుడవనీ అనేది. కాని నాలోని ఆందోళనకు ఆమె ముభావంవహించింది. ఈ ముభావమే నాకు మహా దానందం ఒనగూర్చింది. నా కళ్ళు ఆందోళనతో అన్వే షించడం మానివేశాయి. మనసుకు స్వస్థత చిక్కింది.

క్రమంగా ఆందోళన సమసిపోయింది. ఆ కుటుంబంతో స్నేహం ఏర్పడింది. ఒకొక్కపుడు టీ తాగడానికి వారి కచేరీగదికి నన్ను పిలిచేవారు. ఒకొక్కపుడు నేను వారిని నా గదికి ఆహ్వానించి రొట్టె ముక్కలు ఇచ్చేవాడిని. తరుచు నా చదువుకు ఆటంకం కలుగుతూండేది. కాని నేను ఏమాత్రం లెక్కచేయలేదు. ఒకళ్లాసారికి పనీ పాటా ఉండేది కాదు. ఇష్టంవచ్చినట్లు చేయడానికి ఆమెకూతురికికూడా కావలసినంత వ్యవధి ఉందని తేలింది.

సామాన్యంగా ఆమె కుమార్తె వచ్చి నన్ను టీకి పిలుచుకు వెళుతుండేది. ఒకొక్కపుడు నడవలోనుంచివచ్చేది. ఒకొక్కపుడు కచేరీగదిలోనుంచి పక్కగదిలోకి వచ్చి తన రూపమంతా కనిపించేటట్టు తలుపువెనక ఒక్కక్షణం నిలిచి 'చదువుకుంటున్నారా?' అని అడిగేది. ఆ అమ్మాయి టీకి ఎపుడు పిలుస్తుందా అని నిరీక్షిస్తూ నా వ్రాత బల్లముందు కూర్చుని పుస్తకం నా కంటికి అంటుకుపోయేటు చదువుతున్న వాడిలా నటించేవాడిని. ఒకొక్కప్పుడు ఏదో పనిమీదవచ్చి, ఆ అమ్మాయి నాతో ఒంటరిగా మాటాడుతూ కూర్చునేది. కొన్ని కొన్ని సమయాలలో నా హృదయం తమాషాగా ఆందోళనకు లోనయేది. కాని ఆమెమాత్రం ప్రశాంతంగా ఉండేది. ఎక్కువసేపు నా గదిలో ఉండిపోయినపుడు తల్లి పిలిచినా త్వరగా లేచి వెళ్ళేది కాదు. కాని ఆమె చంటి పిల్లేమీకాదు. ఈ విషయం నాకు అర్థం అయేటట్లుచేయాలని ఆమె యత్నిస్తున్నట్టు స్పష్టమయింది.

# 5

ఒకుసాన్ ఎల్లప్పుడూ ఇంటిదగ్గిరే ఉండేది. నా నోటితో నేను చెప్పకూడదు కాని నేనూ ఆమెకూతురూ బాగా చనువుగా మెలగాలని ఆమె వాంఛిస్తున్నట్లు జాగ్రతగా పరిశీలించగా నాకు గోచరించింది. కాని మధ్యమధ్య ఆమె నన్ను రహస్యంగా కనిపెట్టి చూడసాగింది. ఇది నాకు చిరాకెత్తించింది. ఆమె ఏదో ఒకవైఖరి ఖచ్చితంగా అవలంబిస్తే బాగుండేది. హేతువాదదృష్టితోచూస్తే ఈ రెండు వైఖరులు పరస్పర విరుద్ధమయినవే. కాని ఆమె .ఆడది, తెలివితక్కువది అని అనుకున్నాను.

ఆ రోజులలో నాకు స్త్రీలంటే అసహ్యం ప్రబలంగా ఉండేది. కాని నేనుఆమెకూతురును తృణీకరించలేకపోయాను. దగ్గిర ఉన్నపుడు విచక్షణాజ్ఞానం పనిచేసేది కాదు. చివరకది శక్తివిహీనంకూడా అయిపోయినట్టనిపించింది. ఆ పిల్లమీద నాకుగలిగినప్రేమ మూఢవిశ్వాసంగా మారింది. కాని ప్రత్యేకంగా మతవిషయంలో వాడవలసిన ఈ 'మూఢవిశ్వాసం' అనేమాటను యువతివిషయంలో వాడడం చిత్రంగానే కనిపిస్తుంది. కాని యథార్థప్రేమకూ మూఢవిశ్వాసానికీ తేడా లేదని ఇప్పటికీ గాఢంగావిశ్వసిస్తున్నాను. ఆ పిల్లమొహంకేసి చూసినపుడల్లా నాలో రమణీయత పెంపొందుతున్నటు అనిపించేది. ఆమెనుగురించి ఆలోచించినపుడు వెంటనే మహోన్నతమయిన ఉద్వేగం నను ముంచెత్తినట్టు తోచేది. ఆమె

కేసిచూసే నా కళ్ళల్లో, ఆమెనుగురించి ఆలోచించే నా హృదయంలో ఏమాత్రం భౌతికవాసనా లేనట్లే ఉండేది.

కాని కొన్నివిషయాలు నన్ను తలకిందులు చేసి వేశాయి. ఆ కుటుంబాన్ని చూడడానికి ఎవరో గాని వచ్చే వారు కారు. కాని ఒక్కొక్కప్పుడు ఇంటిలో పురుషస్వరం వినిపిస్తుండేది. అటువంటప్పుడు ఏదో విచిత్రమైన కంపనం, ఉద్రేకం నాలో కలిగేవి. అతను ఎవరు? పడుచువాడా, మధ్య వయస్కుడా? ఆశ్చర్యపోతుండేవాడిని. ఆ పురుషుడు వెళ్ళి పోయినతరువాత అతనిపే రేమిటని అడుగుతుండేవాడిని. వారిని ఇంకా తరిచితరిచి అడగలేకపోయాను. కాని నా కళ్ళు మాత్రం నా ఊహలను పట్టిచ్చేవి.

ఆ పిల్లమీద ప్రేమ దినదినాభివృద్ధి గాంచినకొద్దీ, మాముగ్గురిమధ్యా సంబంధాలు క్లిష్టమయినకొద్దీ ఒకసారి నేను సరిగా అర్థంచేసుకోలేదని గుర్తించాను. నా విష యంలో ఆమె అనుసరించిన పరస్పరవిరుద్ధవైఖరులు రెండూ యథార్థములైనవేననీ, అవి ఒకటితరవాత ఒకటి ఆమె మనసుమీద పెత్తనంచేసినట్లు కాక ఎల్లప్పుడూ ఏకంగానే నిలచిఉన్నవనీ గ్రహించాను. ఆమెకు తన కూతురూ నేనూ పరస్పరం ప్రేమించుకోవాలనే వుంది. కాని మా ప్రేమ ఆమె ఉచితమనుకున్న హద్దును దాటిపోవడం ఆమెకు ఇష్టం లేదు.

నా భావాలలోకూడా తీవ్రమయిన మార్పులు రాసా గాయి. తల్లీకూతుళ్ళిద్దరూ నన్ను విశ్వసిస్తున్నారని నాకు తెలుసు. నన్ను చూడడానికి వచ్చే స్నేహితులు వారితో

స్వేచ్ఛగా ఏసంకోచమూ లేకుండా మెలుగుతున్నారు. ఆ పిల్ల సహోధ్యాయినులు వచ్చినపుడు అందరూ బహుమెల్లగా మాట్లాడుకునేవారు. ఈ విషయాలలో నేను డబ్బుచెల్లించే అతిథిగాగాక ఇంటియజమానిగా కనిపించేవాడిని. తల్లి నన్ను విశ్వసిస్తున్నదా లేదా అనే అనుమానం మధ్యమధ్య నన్ను బాధిస్తున్నా నేనుమాత్రం ఆమెకూతురిని పూర్తిగా విశ్వసించాను. నా గతజీవితాన్నిగురించి మొదట్లో వారితో ఏమీ చెప్పలేదు. కాని నా ఇంటివిషయాలు తెలుసుకోవాలనే కుతూహలం వారికి ఎక్కువయింది. చివరికి నా ఇంటిగొడవలన్నీ వారితో చెప్పివేశాను. నేను నా జన్మస్థలానికి ఎన్నటికీ తిరిగివెళ్ళనని చెప్పేసరికి ఒకుసాన్ మనసు కదలబారినట్టు కనిపించింది. కూతురు ఏడ్చింది.

నా గతజీవితవిషయం అంతా విని ఒకుసాన్ తనరక్తబంధువును ఆదరించినట్టు నన్ను ఆదరించసాగింది. ఏ ఉద్దేశంతో మా బాబాయి తనకూతురును నాకు వివాహంచేయ తలపెట్టాడో ఆ ఉద్దేశంతోనే ఒకుసాన్ తనకూతురూ నేనూ ప్రేమించుకోవాలని ఆశిస్తున్నదేమో ననుకుని ఆశ్చర్యపోయాను. ఒకొక్కపుడు ఒకుసాన్ మాంచి జిత్తులమారిగా కనిపించేది. వారి ఆర్థికపరిస్థితి సవ్యంగాలేదు. డబ్బు దృష్టితో చూస్తే నాతో సంబంధం వారికి నష్టదాయకంకాదు. అంతే కాదు. తల్లితోపాటు కూతురుకూడా మంచి జిత్తులమారి అనే ఘోరానుమానం నన్ను బాధించసాగింది. ఈ అనుమానాలు నాలో నిరాశను రేకెత్తించాయి. కాని ఆమెకూతురును ప్రేమించాను, విశ్వసించాను. ఆ పిల్లను నాకిచ్చి వివాహంచేయమని

అడుగుదామని తరుచు నిశ్చయించుకున్నాను. కాని తీరాఅడగ వచ్చేసరికి మా బాబాయిలాగా వీరూ నన్ను వలలో వేసు కుంటారేమోనన్న భీతితో తటపటాయించేవాడిని.

ఈవిధంగా విశ్వాసం, భ్రాంతి మధ్య పడి ఏమీ చేయ లేకపోయాను. ఈ విశ్వాసం, ఈ భ్రాంతీ నాభావనాశక్తినుంచీ యథార్థతనుంచీ జనించినట్టుగానే భావించుకున్నాను.

## 6

నేను ఎప్పుడూ పుస్తకాలు కొంటూంటానేమో, వాటితోబాటు దుస్తులుకూడా కొన్ని కొనుక్కోమని ఒక నాడు ఒకుసానా నాకు సలహాఇచ్చింది. నాకు ఉన్న కిమోనో లన్నీ చేతితో నేసినవే. పట్టువికూడా కావు. ఆరోజులలో విద్యార్థులు పట్టుదుస్తులు వేసుకునేవారు కారు. పట్టపరీక్షలో ఉత్తీర్ణుడనయి, మీసం పెంచేవరకు దుస్తులవిషయమయి బాధ పడనక్కరలేదనే చిత్రమయిన భావం నాలో మెలుగు తూండేది. కాని ఇప్పుడు కొన్ని పట్టుదుస్తులు కొనాలని నిశ్చయించుకున్నాను. ఆ అమ్మాయికి ఓబీ కాని కిమోనో కాని కొని ఇవ్వాలనికూడా తలపెట్టాను.

ఒకుసాన్‌ని నా బదులు వెళ్ళి కావలసినవి కొనుక్కు రమ్మని కోరాను. కాని ఆమె నన్ను, తన కూతురిని కూడా తనతోరమ్మని పట్టుబట్టింది. పడుచుపిల్లలతోకలిసి బయటికి వెళ్ళడం ఆ రోజులలో మా విద్యార్థులకు అలవాటులేదు. అందుచేత నేను కొద్దిగా భయపడ్డాను. అంతేకాదు, ఆ పిల్ల

బాగా అలంకరించుకుంది. తోవలో నావంకా, ఆమెవంకా నలుగురూ చూసేసరికి నాకు కంపరమెత్తింది. కావలసినవి కొనుక్కున్నతరవాత ఒకుసాన్ మమ్మల్ని సందులోని ఒక హోటలుకు తీసుకువెళ్ళింది. అక్కడ మేము ముగ్గురమూ భోజనంచేశాము.

సోమవారంనాడు బడికి వెళ్ళగానే నా సహాధ్యాయి ఒకడు నన్ను ఏడిపించాలనే ఉద్దేశంతో పెళ్ళి ఎపుడయిందీ, నీ భార్య మంచి అందగత్తే అని అడిగాడు. ఇంటికి తిరిగి రాగానే ఈ సంగతి ఒకుసాన్‌తోను, ఆమెకుమార్తెతోను చెప్పాను. ఆమెకూతురు నవ్వుతూ, 'ఓ, అటువంటిమాటలు యెలా అన్నాడు చెప్మా!' అని బట్టలఅలమారాముందు కూర్చుని దేనికోసో చూడసాగింది. రెండురోజులక్రితం నా కోసం కొనుక్కున్న కిమోనో, ఆ అమ్మాయి కోసం కొన్న కిమోనో రెండిటినీకలిపి అందులో ఉంచారు.

ఒకుసాన్, నేనూ ఆమెకూతురువివాహవిషయం చర్చించసాగాము. తనకూతురికి రెండుమూడు సంబంధాలు వచ్చినా ఆమె ఇంకా చిన్నపిల్లఅవడంవల్ల ఏదీ నిశ్చయం చేయలేదని ఒకుసాన్ నాతో చెప్పింది. తన కూతురంత అంద మయినపిల్లకి సంబంధం కుదరడం పెద కష్టమేమీ కాదని ఆమె భావిస్తున్నట్టుంది. పైగా ఆపిల్లఒక్కతే ఆమెకి సంతా నం. అందుచేత తొందరపడవలసిన అగత్యమూ లేదు. ఈ సంభాషణలో మునిగిపోయి నా కిచ్చి వివాహంచేయమని అడిగే అవకాశాన్ని జారవిడిచాను.

మాముగ్గురిమధ్య సంబంధం ఇలా ఉండగా ఇంకొ కతను రంగంలో ప్రవేశించాడు. ఈ సంఘటన నా నుదుటి గీతనే తలకిందులు చేసివేసింది. ఏదో భూతం నా పక్కగా నడుస్తూ నా జీవితం అంధకారబంధురం చేయబోతోందనే పరిజ్ఞానమే నా కా నిమిషంలో కలగలేదు. చిత్ర మేమిటంటే నేనే ఆ మనిషిని ఆ ఇంటిలో ప్రవేశపెట్టాను.

# 7

ఆ స్నేహితుని కె అని పిలుస్తాను. మాఇద్దరిది ఒకటే ఊరు. షిన్సూతెగకుచెందిన ఒక పురోహితుని రెండవకుమారుడు అతను. అతనితండ్రి బాగా కలవాడే. కాని ఏకారణం చేతనో మాధ్యమికపాఠశాలలో చదువుతూండగానే అతనిని ఒక డాక్టరుకు పెంపుఇచ్చారు. మాస్టరు హాజరు వేసుకునే టపుడు కె ఇంటిపేరు హఠాత్తుగా మారిపోవడం నాకు ఆశ్చర్యంగొలిపింది.

కె పెంపుడుతండ్రికూడా బాగా కలవాడే. టోకియోలోని స్కూలుకు కె ని పంపించారు. మేమిద్దరం ఒకే హాస్టలులో నివసించాము. మా చిన్నగదిలో కూర్చుని ఎక్కడో శిఖరాగ్రంమీద కూర్చుని ప్రపంచంవిషయం ఆలోచిస్తున్నట్టుగామామాకోరికలనుగురించిమాట్లాడుకొనసాగాము. మాకు గొప్పవాళ్ళం కావాలనేకాంక్ష మనస్ఫూర్తిగా ఉంది. అప్పటికే కె కి మతంలో తత్వశాస్త్రంలో ఆసక్తి ఎక్కువగా ఉండేది.

కె ని పెంచుకున్నవారికి అతడు డాక్టరు కావాలనే కోరిక ఉండేది. కాని అతనికిమాత్రం ఆ కోరిక లేదు. తనను పెంచుకున్నవారిని మోసగిస్తున్నాననీ, సత్యమార్గాన్వేషణ నిమిత్తం ఇలా చేస్తుండడంవల్ల తననడత క్షమార్హమనీ అనేవాడు. మహోత్సాహంతో ఆదర్శాన్ని చేరుకోవాలనే అతని యత్నం నన్ను ముగ్ధుణ్ణిచేసింది. ఈ విషయంలో నేను అతనిని ప్రోత్సహిస్తూండడంవల్ల అతనికి ఏదయినా సంభవిస్తే ఆ బాధ్యత నాదే కావచ్చని గుర్తించాను.

మొదటి వేసంగిసెలవులకు అతను ఇంటికి వెళ్ళలేదు. కొమగోమ్‌లోని ఒక దేవాలయంలోని గదిలో నివసించాడు. అనుకున్నప్రకారం చదువుకునే అవకాశంచిక్కిందని సంతోషించాడు. అతని మణికట్టుకి ఒక జపమాల ఉండేది. దానిలోని పూసలు లెక్కపెడుతుండేవాడు. గదిలో బైబిలుకూడా ఉండేది.

రెండవసంవత్సరం వేసంగికి ఇంటికి వెళ్ళాడు. తన రహస్యం ఎవరికీ తెలియనీయలేదు. అతను ఏమి చదువుతున్నదీ అతని కుటుంబంవారు తెలుసుకోలేదు. ఇక మూడవ సంవత్సరం అతను మామూలుగా టోకియోలోనే ఉండిపోయాడు. ఆసంవత్సరమే మా బాబాయితో అభిప్రాయభేదంవచ్చి ఇక ఎన్నటికీ ఇంటికి తిరిగి వెళ్ళకూడదనే దృఢనిశ్చయంతో నేనూ టోకియో చేరుకున్నాను. టోకియోకి రాగానే కె ని కలుసుకున్నాను. తను చేసిందంతా ఒప్పుకుంటూ పెంపుడుతండ్రికి ఉత్తరం వ్రాశానని కె నాతో చెప్పాడు.

కె పెంపుడుతండ్రికి అమితకోపంవచ్చి తలిదండ్రులను మోసగించినందుకు ఇక ఎన్నటికీ డబ్బు పంపడం జరగదని వెంటనే వ్రాశాడట. కె కన్నతలిదండ్రులకికూడా కోపంవచ్చింది. ఏమీసహాయంచేయ సిద్ధపడలేదు. అందుచేత కె కి డబ్బుసమస్య వచ్చిపడింది. ఒకరాత్రిపాఠశాలలో మాస్టరుగా కుదిరాడు. ఈ రోజులలోకంటె ఆరోజులలో జీవనం తేలికగా ఉండేది. విద్యార్థులు చదువుకుంటూనే ఏదయినా పనిచేసుకునే అవకాశం లభించేది. అతని చేతలన్నింటిలో నాకు సంబంధం కలిగి ఆర్థికంగా సహాయంచేయడానికి తలపడ్డాను. కాని అతను నిరాకరించాడు. విశ్వవిద్యాలయంలో చదువుకుంటూ పొట్టపోసుకోకపోవడం పురుషలక్షణం కాదని నాతో వాదించాడు.

అతనికీ అతని పెంపుడు తలిదండ్రులకూ సంబంధాలు ఒకకొలికికి రాక ఇంకా క్లిష్టంగా తయారయినాయి. ఎవరో ఒకరు మధ్యవర్తిగా వ్యవహరించాలి. కాని కె మొండిపట్టుదలతో అతనిమాట వినలేదు. కన్నతలిదండ్రుల కోపం పోగొట్టాలని వారికి నేను ఉత్తరం వ్రాశాను. కాని ప్రయోజనం లేకపోయింది. నాకు వారు సమాధానంకూడా ఇవ్వలేదు. ఎలాగయితేనేం చివరికి కె అతని కన్న తలిదండ్రుల వద్దకు వెళ్ళేటట్లు అతనిచదువుకయినడబ్బు వారు పెంపుడు తండ్రికి తిరిగి ఇచ్చివేసేటట్లు పరిష్కారమయింది. కాని అతని కన్నతలిదండ్రులు ఆతరువాత అతనితో సంబంధమేమీ పెట్టుకోమని చెప్పివేశారు. కె కి తల్లిలేదు. సవతితల్లి పెంచింది. అతని తల్లిగనుక జీవించిఉండేటే కుటుంబంతో అతని సంబం

ధాలు సన్నిహితంగా ఉండేవనీ, అతనితండ్రి నీచుడిలా గాక పురోహితుడిలాగానే ప్రవర్తించేవాడనీ తలపోశాను.

ఈ క్లిష్టకాలంలో కె సోదరి, ఆ మెథ ర్త అతని విషయంలో బాధపడ్డారు. సానుభూతి చూపారు. కాని వారిస్థితి బాగుండకపోవడంవల్ల అతనికి ఆర్థికంగా ఏమీ సహాయం చేయలేకపోయారు.

సంవత్సరంనరపాటు కె ఎవరి సహాయం లేకుండా తనపొట్ట తను పోసుకున్నాడు. కాని అతిగా పనిచేశాడేమో, ఆరోగ్యం, ఉత్సాహం రెండూ దెబ్బతిన్నాయి. ఈ క్లిష్టపరిస్థితులు, సర్దుబాటులువల్ల అతనిమనసు చెదిరిపోయింది. భవిష్యత్తులోని కాంతి దూరమయిపోతున్నట్లు అతనికి అనిపించింది. చదువు ఒక్కటే తనలక్ష్యం కాదంటూ నాసహాయం నిరాకరించాడు. కష్టాలు అనుభవిస్తూ, మానసికశక్తిని పెంపొందించుకుంటేనే తాను శక్తివంతుడనవుతానని విశ్వసించేవాడు. చివరికి మనిషి పూర్తిగా కుంగిపోయేస్థితికి వచ్చిన తరువాత ఎంతో బతిమాలగా నాతోబాటు ఉండడానికి అంగీకరించాడు.

# 8

నా గదిలోకి రావాలంటే ముందరఉన్న ఇంకో చిన్న గదిలోనుంచిరావాలి. ఆచిన్నగది కె కి ఇచ్చాను. పైనుడబ్బు సంపాదనకు హోటలు పెట్టినదానిని కాదంటూ కె ని ఇంటికి తీసుకురావడానికి ఒకుసాన్ అభ్యంతరంచెప్పింది. కె కి అతని రెండుకుటుంబాలతో వచ్చిన చిక్కునుగురించీ, అతని ఆరో

గ్యం నానాటికి ఎలా చెడిపోతున్నదీ ఆమెకు చెప్పాను. అంతేకాదు. నీటిలోపడ్డవానిని బయటికి తీసి వంటికి వెచ్చదనం ఇవ్వడానికి రొమ్ముకు అదుముకునేవాని దృఢనిశ్చయంతో నేను కె ని తీసుకువచ్చానని చెప్పాను. కె ఆర్థికవిషయాలు ఒకింతయినా చెప్పకుండా అతనిని ఇంట్లో ఉండనిమ్మని ఆమెను బతిమాలాను. ఈ విషయం కెకి తెలియనీయలేదు. నలుగురితో కలిసిమెలిసితిరిగేస్వభావం ఇంకా అలవడకపోయినా మా ఇంటిలో స్థిరపడ్డాడు.

ఈ కొత్తనివాసం ఎలా ఉందని ప్రశ్నించగా మరేమంత పాడుగా లేదని జవాబిచ్చాడు. అవును. ఉత్తరముఖంగా ఉన్న ఒక దరిద్రపుగదినుంచీ అంతటి దరిద్రపు తిండినుంచీ బయటపడ్డాడు. ఎక్కడో అగాధంలోఉన్న లోయలోనుంచి పైకివచ్చి ఎత్తయిన చెట్టుమీదకు చేరుకున్న పక్షిలా వుంది అతనిపని. వాస్తవికభావాలను దాచుకునే స్వభావం అతనికి మొండితనంవల్లనే గాక అతని జీవితతత్త్వంవల్ల కూడా అలవడింది బౌద్ధసిద్ధాంతాలమధ్య పెరిగినవాడేమో తిండి, బట్ట మొదలయిన విషయాలను గురించి మాట్లాడడం పాపమని భావించసాగాడు. పూర్వకాలపు ఋషుల జీవితగాథలను చదవటంవల్ల ఆత్మ వేరు, శరీరం వేరు అనే నమ్మకానికి వచ్చాడు.

అతనికి ఎదురుచెప్పకుండా ఉండాలని సాధ్యమయినంతవరకు ప్రయత్నించాను. సూర్యరశ్మిలో మంచుగడ్డను కరిగించాలని చూశాను. అతనిమనసు కరిగి ద్రవిస్తే, ఆత్మ చైతన్యంపొందే ఘడియ వస్తుందనే నా విశ్వాసం.

# 9

కె నాకంటె ఎక్కువ ధృఢసంకల్పంగల వ్యక్తి. నా కంటె రెట్టింపుకాలం పనిచేసేవాడు. పుట్టుకతోనే నాకంటె మేధావి. అతనికి అతిసహనానికి, క్షమకుగల భేదం అర్థమయి నట్టులేదు. బయటనుంచివచ్చే ప్రేరణనుబట్టే మన శక్తి సామర్థ్యాలు అభివృద్ధిచెందడమో నాశనంకావడమో సంభవిస్తుంది. పొట్టకంటె సోమారిపోతు లేదని ఒక డాక్టరు విశదంగా చెప్పాడు. మనంగనక ఎల్లప్పుడూ కావ్రూ (బియ్యపు జావ) తాగితే గట్టిపదార్థాలను జీర్ణించుకునే శక్తి చచ్చిపోతుంది. అందుచేత మనం రకరకాల పదార్థాలు తింటూ ఉండాలని ఆ డాక్టరు చెప్పాడు. అటువంటి ఆహారానికి మన కడుపులు అలవాటుపడిపోయాయనే చిన్నస్త్రీయథార్థంతో నేను దీనిని విశదీకరించలేను.

హితవు ఎక్కువయినకొద్దీ జీర్ణశక్తికూడా ఎక్కువవుతుంది. మన జీర్ణశక్తి క్రమక్రమంగా బలహీనపడిపోతే ఏమయేదీ ఊహించుకుంటే ఇది మనకి బాగా అర్థమవుతుంది. కె ఈ విషయం గమనించనే లేదు. కష్టాలకు అలవాటుపడిపోతే భరించడం తేలికనీ, చివరకు అవి బాధించనే బాధించవనీ భావించాడు. అతనితో వాదించి లాభంలేదని నాకు తెలుసు. ఎంతవాదించినా లొంగకుండా తనను తానే నాశనంచేసుకుంటాడు. అందువల్ల ఏవిధంగానూ విమర్శించకుండా చుట్టూ పరిస్థితులప్రభావం అతనిమీాద ఎలా ప్రసరించేదీ కని పెట్టి చూడాలని నిశ్చయించుకున్నాను.

అతనితో ఎక్కువగా మాట్లాడుతూ స్నేహభావంతో వర్తించమని ఒకుసాన్ను, ఆమె కుమార్తెను కోరాను. అతను స్నేహభావంతో మెలగడంలేదని కూతురు నాతో చెప్పింది. నన్ను కేంద్రంగా చేసుకుని కె కి ఆ స్త్రీలిద్దరికీ సామాన్యసంబంధాలు ఏర్పర్చడానికి ప్రయత్నించాను. నేను కెతో సంభాషించేటప్పుడు వారిని ఆహ్వానించేవాడిని. మేము ముగ్గురం కలసిఉన్నప్పుడు కె ని పిలిచేవాడిని. మొట్టమొదట కె వీటికి ఇష్టత చూపలేదు. కాని క్రమంగా బిడియం కరిగిపోయింది. తనకు బయట ఒక ప్రపంచమంటూ ఉందని అతను కొద్దికొద్దిగా గుర్తించినట్టుంది. ఒకరోజున స్త్రీలు అసహ్యించుకోతగినంతవారు కారని నాతో అన్నాడు. జీవితం పొడవునా మనమిద్దరం స్నేహంగాఉంటే మనం రెండు సరళ రేఖల్లా పెంపొందుతామని చెప్పాను. క్రమంగా అతను నాతో ఏకీభవించేస్థితికి వచ్చాడు.

# 10

నేనూ కె ఒకే క్లాసులో చదువుతున్నా మామా అభిమానవిషయాలు వేరుఅవడంవల్ల బడికి మా రాకపోకల కాలం ఒకటికాలేదు. ఒకరోజున కొండపనిమీద వెళ్ళి ఇంటికి ఆలస్యంగా వెళ్ళాను. సింహద్వారం తెరిచేసరికి కె గదిలో నుంచి కూతురుకంఠం వినిపించింది. అతని గదిలోనుంచి వెళ్ళడానికి పక్కతలుపు తెరిచాను. వారిద్దరూ అక్కడ కూర్చుని ఉన్నారు. కె మామూలుగా, "యిదేనా రావడం?" అన్నాడు. ఆమెకూడా 'ఓ, వచ్చారా' అని నన్ను పలకరించింది. ఆ పలక

రించడం ఏదో మొక్కుబడి చెల్లించుకున్నట్టుంది. ఆ కంఠ స్వరం సహజంగా లేదు. ఒకుసాన్ ఎక్కడ అని అడిగాను. నా ప్రశ్నకు అర్థంలేదు. రోజూకంటె ఇల్లు ప్రశాంతంగా ఉండడంవల్ల ఈ ప్రశ్న వేశాను.

ఒకుసాన్ బయటికి ఎక్కడికో వెళ్ళింది. దాసీకూడా ఆమెతో వెళ్ళింది. అందువల్ల కె, కూతురు ఇంట్లో ఒంటరిగా ఉండిపోయారు. ఇంటిలో నన్నూ, కూతురును ఒంటరిగా వదిలి ఒకుసాన్ ఎన్నడూ బయటికి వెళ్ళలేదు. అందువల్ల ఏదో అత్యవసరమయిన పనిమీద వెళ్ళిందా అని అడిగాను. ఆ బాలిక నవ్వి తనతల్లి పనిమీద బయటికి వెళ్ళవలసివచ్చిం దని చెప్పింది. అటువంటప్పుడు ఆడదినవ్వడం నాకు నచ్చలేదు.

ఒకవారంరోజుల తరవాత మళ్ళీ కె, కూతురు ఆ గది లోనే కూర్చుని మాట్లాడుకోవడం కనిపెట్టాను. నా మొహం కనిపించగానే నవ్వడం ఆరంభించింది. మేము నలుగురమూ భోజనానికి కూర్చున్నపుడు ఆ బాలిక నేను చిత్రమయినవాడ నని అంది.

రాత్రి భోజనాలు అయినాక నేనూ కె షికారు వెళ్ళాము. మేము ఎక్కువగా మాట్లాడుకోలేదు. మేము నివ సిస్తున్న ఇంటివారిని గురించి అతనిని ప్రశ్నించాలని యత్నిం చాను. ఒకుసాన్ మీద, ఆమెకూతురుమీద అతని అభి ప్రాయం తెలుసుకోవాలని తలిచాను. కాని అతని సమా ధానాలు అస్పష్టంగా ఉన్నాయి. ఏమీ బోధపడలేదు. ఇప్పుడు వెనుదిరిగి చూసుకుంటే ఆసమయంలోనే అతనంటే నాకు అసూయ ఏర్పడిందని గుర్తుకు వచ్చింది.

వేసవి శెలవులకు మేమిద్దరమూ కలిసి బోష్టూ వెళ్ళాము. అతనికి ఇష్టమయినచోటుకు వెళ్ళడానికి డబ్బు లేదు. నేను నాతోకూడా రమ్మనగానే వచ్చాడు. ఒకుసాన్‌తో ఆమె కూతురుతో, కె ని వదిలివెళ్ళడం నా కిష్టంలేకపోయింది. వారిద్దరూ ఎక్కువ చనువుగా మెలుగుతారనే ఆలోచన నాకు బాధాకరమయింది.

మేము హోటా అనే చేపలరేవుదగ్గర కొన్నిరోజుల పాటు ఉన్నాము. అక్కడ ఒకటే చేపలవాసన. ఆ రేవులో దిగగానే అలలవెంట కొట్టుకొనివచ్చే రాళ్ళు తగిలి మాచర్మం కొట్టుకుపోయింది. త్వరలోనే బయలుదేరి టోమియూరా వెళ్ళాము. అక్కడినుంచి నాకోతీరంవెంబడే ఉన్న స్థలాలకు వేసవికి విద్యార్థులు ఎక్కువగా వస్తూంటారు. నేనూ, కె తరుచు బీచిలోని రాతిబండలమీద కూర్చుని సముద్రంకేసి చూస్తూండేవారము. నేను చదవాలని తరుచు ప్రయత్నించాను. కె కదలకుండా మెదలకుండా కూర్చునేవాడు. కె బదులు ఒకుసాన్ కూతురే గనక నా పక్కన కూర్చునిఉంటే ఎంత ఆనందదాయకంగా ఉండేదోనని భావించుకునేవాడిని. కె కూడా ఇలాంటి ఆలోచనలతో ఉన్నాడేమో ననుకుని ఆశ్చర్యపోయేవాడిని. ఇటువంటిభావం నాలో కలిగినప్పుడల్లా వెంటనే లేచి నుంచుని బిగ్గరగా బిడియపడకుండా అరిచేవాడిని. పాటలుగాని పద్యాలుగాని పాడలేనంత ఆవేశం పొంగిపోయేది. ఏదో అడవిమనిషిలా అరిచేవాడిని. ఒకమాటు హఠాత్తుగా వెనకనుంచి కె మెడ గట్టిగాపట్టుకొని సముద్రంలోకి తోసివేస్తే ఏంజేస్తావు అని ప్రశ్నించాను. కె

కదలకుండా 'సరే తో సేసెయ్. అదే నేను కోరుకునేదీను' అని జవాబిచ్చాను తల వెనకకు తిప్పకుండా.

నా భావాలను కెకి వెల్లడించాలని నిశ్చయించుకున్నాను. కాని అదేమంత తేలిక అనిపించలేదు. నేనూ, కె ఏవిషయమన్నా మాట్లాడుకోగలం. ప్రేమనుగురించి ఎప్పుడో గాని మాట్లాడుకునేవారం గాము. ఆ సంభాషణ అయినా అస్పష్టమయిన వాదనతో ముగిసేది. మేము ఎక్కువగా పుస్తకాలను గురించీ, విజ్ఞానంగురించీ, భవిష్యత్కార్యకలాపంగురించీ, మా ఆశలను గురించీ, మా సంస్కృతిని గురించీ మాట్లాడుకునేవారము. మా సంభాషణలో వ్యక్తి ప్రసక్తి ఉండేదికాదు. అందువల్ల హఠాత్తుగా సంభాషణా స్వరూపం మార్చడం సాధ్యమయేది కాదు. మేము ఎంత అసఖ్యంగా వుంటామో అంతచనువుగానూ ఉండేవారము. ఒకప్పుడు అతనితల బద్దలుకొట్టి దానిలోకి కొత్తగాలి ఎక్కించాలని తలచేవాడిని. అతని హృదయం నల్ల లక్కతో నిండిపోయిందా అనిపించేది. అతని నాళాలలోకి నేను ఎక్కించదలచిన రక్తమంతా వెనుదిరిగి వచ్చేస్తున్నట్టు, ఒక్క చుక్కయినా అతని గుండెకాయలోకి ఎక్కనట్టు అనిపించేది.

అతనితో నన్ను పోల్చిచూసుకుంటే అతనిదే పై చేయిగా ఉండేది. రూపురేఖలు చూసుకుంటే అతనినే స్త్రీలు ఎక్కువగా ప్రేమిస్తారు. అతని ఆకారంలో విశ్వసనీయమయిన పురుషత్వం ఉంది. ఇక విజ్ఞానంవిషయం చూసుకుంటే అతనిముందు నే నెందుకూ పనికిరాను.

మే మిద్దరమూ కలిసి తిరుగుతూ, స్నానాలుచేస్తూ పొద్దుపుచ్చుతూంటే నా ఆత్మ ఇంకో శరీరంలో ప్రవేశించిందా అని అకస్మాత్తుగా అనిపించేది. కె తో నాకుగల చనువు, అతనిమీది ద్వేషం ప్రత్యేకగుణాం అలవర్చుకోసాగాయి. ఈ భావాలు ఈ ప్రయాణంతో అంతమవుతాయని భావించాను. ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ వేడిమి, ఈ సముద్రస్నానాలు, ఈ షికార్లు మూలంగా మా సంబంధాలు కొత్త బాటను నడుస్తాయని ఆశించాను. ఆ సమయంలో కలిసి ప్రయాణంచేసే వీధివర్తకులముగా తయారయాము.

ఒకరోజున మేము కోమినాటూలోని టాయినోరా (సముద్రపు జెల్లల అఖాతం) చూడడానికి మేము వెళ్ళడం నా కిప్పటికీ జ్ఞాపకంఉంది. అది నిచిరెన్ సుప్రసిద్ధ బౌద్ధ సన్యాసి పుట్టినచోటని వాడుక. ఆయన పుట్టినరోజున రెండు సముద్రపు జెల్లలు ఒడ్డుకు వచ్చిపడ్డాయట! ఆనాటినుంచీ బెస్తలు ఆ చేపలను పట్టుకోవడం మానివేశారు. అందువల్ల ఆ అఖాతంనిండా జెల్లలే! సముద్రంలో ధూమ్రవర్ణపుమేఘం లాగా కదలాడే చేపలను చూస్తున్నాము. కె చేపలనుగురించి కంటె నిచిరెన్‌నుగురించి ఎక్కువగా ఆలోచిస్తున్నట్టు కనిపించాడు. ఆ తరవాత అక్కడి టాంజోజీ (దేవాలయం) పూజారితో మాట్లాడడానికి వెళ్ళాం. కె, పూజారీ నిచిరెన్‌ను గురించి చర్చించసాగారు. నేను ముభావంగా మాట్లాడకుండా ఉండిపోయాను. మేము అక్కడినుంచి వచ్చివేసిన తరవాత నిచిరెన్ ఎడ ముభావంవహించినందుకు నామీద మండిపడి, ఆధ్యాత్మిక పురోగతిభావం లోపించినవారంతా తెలివి

తక్కువ ముద్దులని నిందించాను కె. ఒకుసాన్ కూతురువిషయం నా గుండెలో రాయిఅయి కూర్చున్న కారణంగా నేను నిచిరెన్ ఎడ ముభావం వహించాననే సంగతి కె గ్రహించలేదు. అంతెందుకు? నేను మానవుడిని. నాలోని లోపాలన్నిటికీ 'మానవుడిని' అనే ముసుగు వేస్తున్నానని అనుకుంటున్నాను.

మేము రైయోగోకో వెళ్ళి వేడిగా లేకపోయినా కోచిన్-చీనా కోడిమాంసం తిని టోకియో నడిచి వెళ్ళాం. అక్కడికి చేరుకునేటప్పటికి ఎండదెబ్బకొట్టి అలసిపోయాము.

## 11

మేము చాలాదూరం సంచారంచేసి వచ్చామేమో తిరిగి మామూలు కార్యక్రమంలో పడడానికి ఆడ ఆసరా కావలసివచ్చింది. ఒకుసాన కూతురు మా వ్యవహారాలన్నిటినీ చూడసాగింది. కె మీదకంటె నామీద ఎక్కువ దయ, శ్రద్ధ చూపింది. ఈ విషయం కె గమనించినట్లు లేదు. అసంతృప్తీ వెల్లడించలేదు. నా మనసులో అతనిమీద విజయం సాధించానని ఆనందించాను.

అక్టోబరు సగం గడిచింది. అప్పటివరకు అంతా సవ్యంగానే గడిచినట్లు అనిపించింది. ఇలా ఉండగా ఒక రోజున నేను బడినుంచి తిరిగి వచ్చేసరికి కె గదిలోనుంచి కె గొంతు, ఆ పిల్లనవ్వు వినిపించాయి. నేను గదిలో ప్రవేశించి చూసేసరికి కె పూర్వంలాగానే వ్రాతబల్లముందు కూర్చుని ఉన్నాడు. కె గదిలోనుంచి పరుగెత్తుకుని వెళుతున్న కూతురు పృష్టభాగం నాకంటపడింది. ఇంత పెందలాడే వచ్చావేమని

నేను కె ని ప్రశ్నించాను. వంట్లో బాగాలేకపోవడంవల్ల అసలు బడికే వెళ్ళలేదని కె చెప్పాడు. నేను నా గదిలో ప్రవేశించ గానే కూతురు టీతీసుకుని చకా_వచ్చింది. ఎందుకలా పారి పోయావని నవ్వుతూ అడిగేరకం మనిషిని నేను కాను. కాని దీని మూలంగా నామనసుకు కష్టంవేసింది. ఆనాటినుంచీ ఆమె క్రమక్రమంగా బిడియం విడనాడడంతో నాకు మరింత కష్టం వేసింది. కె గదికి ఆమె తరుచు వచ్చి చాలాసేపు ఉండి పోయేది. ఒకొక్క_ప్పుడు ఉత్తరాలు తీసుకుని, ఒకొక్క_ప్పుడు ఉతికినవస్త్రాలు తీసుకుని వచ్చేది. అందువల్ల ఆమెరాకలో చోద్యం నాకు కనిపించలేదు. ఆమెను నేనొక్క_డనే వశం చేసుకోవాలనే కోరిక బలీయంగా నాలో ఉండడంవల్ల ఆమె రాకపోకలలో ఏదో విశేషం ఉందనిపించింది.

నవంబరులో ఒకరోజున వర్షంకురుస్తోంది. చలి చలిగా ఉంది. నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి కె గదిలోని కుంపటిలో బొగ్గులు కణకణలాడుతున్నాయి. నా గదిలోని కుంపటిలో బూడిదమాత్రం ఉంది. హఠాత్తుగా చికాకువేసింది. ఒకు సాణ వచ్చి తడిసిపోయిన ఓవరుకోటు తీసివేసుకోవడంలో సాయపడింది. కె గదిలోనుంచి కుంపటి తెచ్చి నా గదిలో పెట్టింది. కాని ఆ గదిలో కూర్చుని నేను చదువుకోలేక పోయాను. ఎక్క_డికయినా కళకళలాడే చోటుకు వెళ్ళాలని కాంక్ష పొడమింది. ఇంకేం, గొడుగు బుజానవేసుకుని బయలు దేరాను. ఆయుధశాలవెనక మట్టిగోడవెంటే తూర్పుగా సులోబీ దిగాను. సులోబీ బురదబురదగా ఉంది. నీటి పారు దల సరిగా లేనందువల్ల ఇరుకురోడ్డు బురదమయమయింది.

యూనాజానో వీధికి ఉన్న ఇరుకు రాతివంతెన దగ్గరనుంచి రోడ్డు మరీ అధ్వాన్నంగా ఉంది. రోడ్డుమధ్యగా జాగ్రత్తగా నడవాలి. అందువల్ల మేము ఒకవరసలో మెల్లిగా నడుస్తున్నాం. ఇక్కడ తలవనితలంపుగా కె నాకు ఎదురయినాడు. ఇరుకుదోవలో ఒకరినొకరు దాటుకుపోయాము. అప్పుడు ఒకుసాన్ కూతురు కె వెనక నిలబడిఉంది. ఆ బాలిక కొద్దిగా సిగ్గుతో నన్ను పలకరించింది. నేను పక్కకు తప్పుకుని ఆమెకు దోవ ఇచ్చాను. ఆతరవాత ఎక్కడికి వెళ్ళాలో తోచింది కాదు. ఏ ప్రదేశమూ నాకు సంతృప్తినిస్తుందని తోచలేదు. బురదకొట్టుకొని బట్టలు పాడయిపోతాయని కూడా చూడకుండా నిరాశతో ఆ బురదలోపడి నడిచిపోసాగాను.

ఇంటికి తిరిగివచ్చినతరవాత ఒకుసాన్ కూతురుతో బయటికి వెళ్ళావా అని కె ని అడిగాను. తాను ఆమెతో కలిసి వెళ్ళలేదనీ బయట కలుసుకుని ఇంటికి కలిసితిరిగివచ్చామనీ కె చెప్పాడు. కాని మధ్యాహ్నం భోజనసమయంలో ఆబాలికను అదేప్రశ్న అడిగాను. ఆమె మామూలుప్రకారం నవ్వింది. ఆ నవ్వు నాకు నచ్చలేదు. బుద్ధిపూర్వకంగా ఇలా చేస్తోందో లేక నా భావాలు ఆమె గ్రహించలేదో చెప్పలేను. కొన్నిరోజులతరవాత—బాగా జ్ఞాపకంఉంది—మేము ఒకుసాన్‌తో ఆమెకూతురుతో పద్యపేకలు (pcem cards) ఆడుతూండగా కె ఆట చెడగొట్టాడు. నీకు అసలుఆటవచ్చునా? అని నేను కెని ప్రశ్నించాను. ఇది కె ని అవమానించినట్లుగా కూతురు తీసుకుని తాను కె పక్షాన నిలబడతానని స్పష్టం చేసింది.

ఒకుసాన్‌తో ఆమెకూతురును వివాహంచేసుకునే విషయమయి రాయబారాలు జరపవలసిన సమయం మించి పోతోందని అనుకున్నాను. అయినా తటపటాయించాను. నాకు గుండెధైర్యం లేదని నీవు అనుకోవచ్చు. కె ఇక్కడికి రాకపూర్వము ఎవరివలలోనూ పడకూడదనే దృఢనిశ్చయం నన్నుకుంగదీసివేసి నాలో చలనంలేకుండా చేసింది. కె వచ్చిన తరవాత అతనిఎడ ఆ బాలికభావాలవిషయమయినసందేహం నన్ను ముందుకు సాగనీయలేదు. నే నెంతగా ప్రేమించినా, చాటుగా ఇంకొకరిమీద ప్రేమదృష్టులుబరపే స్త్రీని వివాహ మాడడం అసహ్యంకదూ! పెళ్ళిఅయితే అంతా సవ్యంగానే జరిగిపోతుందనే మెట్టవేదాంతం నాకు సంతృప్తి కలిగించలేదు. అంత గాఢంగా నే నామెను ప్రేమించాను. ముక్తసరిగా చెప్పాలంటే, అతిగొప్పగా ప్రేమసిద్ధాంతం వల్లించేవాడిని. కాని ఒకపట్టాన బయటపడే మనిషిని కాను.

ఏదారి తోక్కాలో తెలియక స్తబ్ధంగా ఉండిపోయాను. శరీరంలో బాగుండక, ఒక కునుకుతీసి లేవగానే చుట్టూ ఉన్న వస్తువులను స్పష్టంగా చూడగలిగినా కాళ్ళూచేతులూ కదిలించలేము. అలా ఉంది నా స్థితి.

ఉగాది వెళ్ళినతరవాత రెండుమూడు రోజులకు ఒకు సాన్, ఆమెకూతురు ఇచిగయాలోని బంధువులను చూడ డానికి ఉదయాన్నే వెళ్ళారు. నేను, కె మిగిలిపోయి ఎవరి గదిలో వాళ్ళం కూచున్నాము. సుమారు పదిగంటలకు హఠాత్తుగా కె నాగదిలోకి వచ్చాడు. అప్పుడు నేను కుంపటి పక్కన మోచేతులమీద గడ్డం ఆనించి కూర్చునిఉన్నాను.

నన్నుచూడగానే ఏమిటో ఆలోచిస్తున్నావు అని కె అడిగాడు. నేను మాట్లాడకుండా అతనివంకే చూడసాగాను. దానిమీద కె వచ్చి కుంపటిపక్కన కూర్చుని ఒకుసాన్‌ను గురించీ ఆమెకుమార్తెనుగురించీ మాట్లాడసాగాడు. అతని మాటలకు నాకు ఎక్కువ కష్టంవేయలేదు గాని దిగ్భ్రమ చెందాను. హఠాత్తుగా అతనిమూతికండరాలు వణుకుతున్నట్లు కదలాడాయి. ఎంతో కష్టంమీదగాని అతనినోటి నుంచి మాటలు పెగలలేదు. ఒకుసాన్‌కూతురుమీద తనకు గల గాఢప్రేమను గురించి విపరీతంగా చెప్పుతుంటే వింటూ కూర్చున్నాను.

# 12

అతనిమాటలు వింటూంటే మంత్రదండంమహిమవల్ల రాయి అయిపోయినట్టయింది నాపని. గొణిగేశక్తికూడా లేకుండాపోయింది. ఆసమయంలో నేను భయోత్పాతంతో గడ్డకట్టుకుపోయానో, వేదనతో గడ్డకట్టుకుపోయానో చెప్పడం కష్టం! ఎలాగయితేనేం గడ్డకట్టుకుపోయాను. నఖశిఖపర్యంతం కొయ్యబారిపోయాను. ఊపిరి పీల్చుకోడానికి వీలు లేనంతగా బిగుసుకుపోయాను. ఒకక్షణం తరవాత స్మృతి తెచ్చుకుని నేను పూర్తిగా అసమర్థుణ్ణయిపోయానని గ్రహించాను. నన్ను బోల్తాకొట్టించారు. ఇక ఏమిచేయాలో బోధపడలేదు. చెమట కారిపోతోంది. కదలకుండా బొమ్మలాగా కూర్చున్నాను. మనసు బాధతో కుంగిపోయింది. కె భాషణ మొదటినుంచి చివరదాకా ఒకటేధోరణిలో ఉంది. అతను

భారంగా, మెలిమెల్లిగా మాట్లాడాడు. నాకంటె అతను బల వంతుడనేభీతి నన్ను ఆవహించింది.

నే నేమీ మాట్లాడలేదు.

మధ్యాహ్నఫలహారాల అనంతరం ఎవరిగదికి వాళ్ళం వెళ్ళిపోయాము. నేను ఆలోచనాసముద్రంలో మునిగిపోయాను. ఒకుసాన్‌కూతురును ప్రేమిస్తున్నానని నేనే ముందుగా అతనివద్ద ఎందుకు ఒప్పుకోలేదు? సమయం మించిపోయింది పశ్చాత్తాపంతో నా తల వణికిపోయింది. కె మళ్ళీ నాగదిలోకి వస్తే బావుండును. ఈ విషయం ఇంకా చర్చించుకోవచ్చని తలపోశాను. కె అతనిగదిలో ప్రశాంతంగా కూర్చున్నాడు. అతను ప్రశాంతంగా కూర్చోడంవల్ల నామనసు కలతనొంద సాగింది. ఆసమయంలో కె ఏమిటి ఆలోచిస్తున్నాడో ఊహించుకుంటూ నరకయాతన అనుభవించాను చివరకు మెదలకుండా కూర్చోలేక వరండాలోకివెళ్ళి అక్కడనుంచి సింహద్వారంలోకి వెళ్ళాను. అక్కడనుంచి వీధిలోపడ్డాను. ఉగాది అలంకరణలతో కళకళలాడుతున్న వీధులవెంట తిరగ సాగాను. ఎంతదూరం నడిచినా కె ని గురించి ఆలోచించడం మానలేకపోయాను. అతనిలో ఇంత మార్పు ఎలా వచ్చింది? అతను ఎంత బలీయుడో, ఎంత నిజాయితీపరుడో నాకు తెలుసు. కాని హఠాత్తుగా అతను నాకు పెనుభూతంలాగా గోచరించాడు. శాశ్వతంగా నన్ను పీడిస్తాడేమోనసేభయం కూడా వేసింది.

ఒకుసాన్, ఆమెకూతురు తిరిగివచ్చిన తరవాత భోజనాలు చేశాము. వారిద్దరూ మామూలుకంటె ఎక్కువ

కులాసాగా ఉన్నారు. నేను, కె మాట్లాడకుండా కూర్చోడం కనిపెట్టారు. ఒకుసాన్ సంగతిఏమిటని ప్రశ్నించింది. వంట్లో బాగుండలేదని నేను జవాబు చెప్పాను. ఆమెకూతురు కె ని అదేప్రశ్న వేసింది. తనకు మాట్లాడాలని లేదని అతను సమాధానం చెప్పాడు.

ఆరాత్రి పెందలాడే పడుకున్నానుగాని నిద్రపట్టలేదు. పొద్దుపోయినతరవాత ఒకుసాన్ ఇంత గోధుమనీటిజావ తెచ్చిఇచ్చింది. తాగాను. ఆమె వెళ్ళిపోయినతరవాత చాలా పొద్దుపోయేవరకు ఆ చీకటిలో ఆలోచిస్తూ పడుకున్నాను. పక్కగదిలోవున్న కె ని పిలిచాను. ఓ అని జవాబిచ్చి పక్క వేసుకోసాగాడు. ఇప్పుడు ఎన్నిగంటలయింది అని ప్రశ్నించాను. ఒంటిగంటా ఇరవయి నిమిషాలయిందని జవాబిచ్చాడు. ఉదయం అతను ప్రస్తావించిన విషయం మీద మాట్లాడుకుందామా అని అడిగాను. తటపటాయిస్తూ 'ఊఁ— కాని—' అన్నాడు మెల్లిగా.

తిరిగి నన్ను భయోత్పాతం ఆవరించింది.

# 13

బడి తెరిచారు. ఒకరోజున ఒకుసాన్కూతురిమీది ప్రేమనుగురించి నాతో చెప్పడమేనా వాళ్ళతోకూడా చెప్పావా అని కె ని అడిగాను. ఇంకెవరితోనూ చెప్పలేదని రూఢిగా చెప్పాడు. ఇంకా ప్రశ్నిద్దామని చూశాను కాని అతను సమాధానం చెప్పకుండా మూగనోముపట్టాడు.

తరవాత కొద్దిరోజులకు మేము తిరిగి తీవ్రంగా అతని ప్రేమవిషయమే మాట్లాడుకోసాగాము. షికారుగా వెళ్ళాము. హఠాత్తుగా కై తన ప్రేమనుగురించి చెప్పనారంభించాడు. కాని అతనివైఖరిలో పూర్వంలాగా కార్యశూరత కనిపించ లేదు. ఇటువంటి అగాధప్రేమలోపడ్డ తననుగురించి నేను ఏమనుకుంటున్నానో చెప్పమని కోరాడు. తనను తానే అర్థంచేసుకోలేకుండా ఉన్నానని అంగీకరించాడు. నేను నొక్కి అడగగా తను ముందుకు సాగిపోవలసిందీ లేక తప్పుకోవల సిందీ తేల్చుకోలేకుండా ఉన్నానని విశదీకరించాడు. వెంటనే నేను ముందుకు ఒక అడుగువేసి, 'తప్పుకోదలచితే తప్పుకో గలవా?' అని ప్రశ్నించాను. జవాబు చెప్పలేకపోయాడు. తాను నరకయాతన అనుభవిస్తున్నానని మాత్రం చెప్పాడు. నిజం, అతను పడుతున్న బాధ అతని మొహంలో స్పష్టంగా కానవస్తోంది. వర్షంకోసం అర్రులుసాచే భూమాతలా ఉంది అతని మొహం.

కత్తిసాము చేసేవాడు ఇంకొక రీతిలో కత్తిసాము శిక్షణ పొందినవానిమీద తనప్రావీణ్యం చూపడానికి జాగ్ర తగా కనిపెట్టి చూసినట్లు నేను కైని అతిజాగ్రతగా కనిపెట్టి చూడసాగాను. నాకళ్ళతో, నామనసుతో, నాశరీరంతో ఒక టేమిటి నాసర్వస్వంతో అతనిని ఎదుర్కొని పోరాటానికి సిద్ధపడ్డాను. ఇక కై వట్టి అమాయకుడు. ఏమాత్రం శ్రద్ధ వహించలేదు. పోరాటానికి సన్నద్ధంకాలేదు.'

కై ఆదర్శానికి, వాస్తవికతకు మధ్య కొట్టుమిట్టాడడం గ్రహించి ఒక్కదెబ్బతో అతనిపనిపట్టించే సమయంకోసం

నిరీక్షిస్తున్నాను. నాలో సిగ్గుకూడా లేదు. మొదటగా ఆధ్యాత్మికాభివృద్ధి అనే భావమే లేనివాడు తెలివితక్కువ మొద్దులని అరిచాను. బోషూలో మేమిద్దరమూ కలిసి తిరుగుతూంటే కె ఈమాటలనే అని నన్ను విమర్శించాడు. అప్పుడు కె ఆ మాటను ఏస్వరంలో అన్నాడో నేనూ అదేస్వరంలో ఇప్పుడు ఆమాటలే కక్కేశాను. చాలాకాలంనుంచీ కె కి షోషిన్ అనే మాటంటే మహాఇష్టం. ఈమాటకు ఇంద్రియనిగ్రహం అనే అర్థంకూడా ఉందని గ్రహించాను. కె మతంలోని ప్రథమ సూత్రమయిన నిచీకోసం సర్వసంగపరిత్యాగం అనేదే దీని అర్థంకూడానని ఇప్పుడు తెలుసుకున్నాను. ఇందులో పరిశుద్ధ ప్రేమకూడా నిషేధింపబడింది. ఇక కామంసంగతి చెప్పేదేముంది?

'అవును. తెలివితక్కువే. నేను తెలివి తక్కువ మొద్దును' అన్నాడు కె.

అతను కదలకుండా మెదలకుండా నిలుచున్నాడు. దృష్టి కిందకుపరిపి నేలను పరీక్షగా చూశాడు. నాకు తెలియకుండానే భయం నన్నావరించింది. సరే నడిచిపోతూ ఇక ముందేమి మాట్లాడుతాడోనని కనిపెట్టుకుని ఉన్నాను. సరిగా చెప్పాలంటే, పొంచివున్నాను. కాని నేను సంస్కృతీపరుడిని. ఎవరన్నాగనక నాచెవిలో 'నీవు పిరికిపందవు' అని అంటే నేనాక్షణంలో మామూలు మనిషినయిపోయేవాడిని. అమాయకపు గొర్రెపిల్లలాంటి కె ని తోడేలులాంటి నేను ఎదుర్కొన్నాను.

'ఇక ఆపుచేద్దాం. ఇక యీవిషయం మాట్లాడ కుండా వుండడం మంచిది' అన్నాడు కె.

'ఆపుచేయమంటున్నావు గాని ప్రారంభించింది నేను కానే. అసలు విషయాన్ని ఆపుచేసే దృఢసంకల్పం లేనిదే మాటలు ఆపుచేసి ప్రయోజనమేమిటి?'

'దృఢసంకల్పమా?' అని అడిగి మళ్ళీ అన్నాడు- 'దృఢసంకల్పం—అవును. నా కింకా కొద్దో గొప్పో దృఢ సంకల్పం వుంది.'

అతని మాటలు స్వగతంలాగా, కలలో మాట్లాడిన మాటలలాగా ఉన్నాయి. అంత పొడుగాటిమనిషి ఇంత లోనే పొట్టిఅయిపోయినట్టు నాకు తోచింది.

# 14

షికారుచేసి ఇంటికి చేరుకున్నాం. ఆరాత్రి ప్రశాం తంగా గడిచింది. నేను కె గదికి వెళ్ళి అతని వ్రాతబల్ల ముందు కూర్చుని బుద్ధిపూర్వకంగానే బాతాఖానీ కొట్ట సాగాను. అతనికి కష్టంవేసినట్టుంది. బహుశా నాకళ్ళు విజయ గర్వంతో మెరిసిపోతున్నట్లున్నాయి. అన్నివిధాలా అతడి కన్న తక్కువవాడినేఅయినా అతన్నిచూసి భయపడనవసరం లేదని ఆసమయంలో నేను గుర్తించాను.

ఆరాత్రి నేను హాయిగా నిద్రపోయాను. హఠాత్తుగా నన్ను ఎవరో పేరుపెట్టిపిలిచేసరికి మెలకువవచ్చింది. తల పై కెత్తి చూశాను. మా రెండుగదులమధ్య తలుపు తెరిచివుంది.

కె నుంచుని ఉన్నాడు. ఏమన్నా పని ఉందా అని ప్రశ్నిం చాను. ఏమీ లేదని సమాధానం చెప్పి తలుపుమూసి తనగది లోకి వెళ్ళిపోయాడు.

అప్పటినుంచి విజయగర్వం నాలో మాసిపోసాగింది. చివరికి మినుకు మినుకుమనే స్థితికి వచ్చింది. 'దృఢసంకల్పం' అని అతను అనడం జ్ఞాపకంవచ్చింది. ఇంతకుపూర్వం ఈ మాటను గురించి నేను ఎన్నడూ ఆలోచించలేదు. ఇప్పుడు ఏదో విచిత్రమయినశక్తితో నామనసును అణచివేయసాగింది. అనుమానాలను, వేదనలను ఒక్కసారిగా తీర్చివేసుకోవడం అనే అంతిమసాధన అతని హృదయంలో రహస్యంగా మెలగుతోందేమోనని నాకు అనుమానంవేసింది. నిష్కల్మష హృదయంతో ఆమాటకుఅర్థం గ్రహించడానికి నేను యత్నిం చితే బాగుండేది. ప్రేమరంగంలో దృఢసంకల్పస్వభావాన్ని సాధించడమే ఆ మాటకు అర్థం అని నేను త్రికరణశుద్ధిగా విశ్వసించాను. నాకూ దృఢసంకల్పం అవసరమని నాలో నేను తలపోసి కె కంటె ముందుగా అతనికి తెలియకుండా నా కార్యం సాధించుకోవాలని నిశ్చయించుకున్నాను.

వారంరోజులవరకు నాకు అవకాశం చిక్కలేదు. ఒక రోజున నాకు జబ్బుగా ఉన్నట్లు నటించాను. కె, ఆ బాలిక బయటికి వెళ్ళేవరకు నిరీక్షించి ఆ తరవాత లేచి స్నానంచేసి ఉదయభోజననిమిత్తం కచేరీగదిలోకి వెళ్ళి కూర్చున్నాను. ఒకుసాణ్ కుంపటిపక్కన నాతో మాట్లాడుతూ కూర్చుంది. దాసీది బల్ల శుభ్రంచేసినతరువాత ఇటీవల కె ఏమన్నా నీతో మాట్లాడాడా అని ఒకుసాన్‌ని అడిగాను. ఒకుసాన్

లేదని చెప్పి ఇంకేమి చెప్తానో అని నిరీక్షించసాగింది. సంభాషణ ఎలా మొదలుపెట్టాలో నాకు తోచలేదు. హఠాత్తుగా, 'ఒకుసాన్, నీ కూతురిని నా కిచ్చి పెళ్ళిచెయ్యి' అని అనేశాను. నేను ఆశించినట్టు ఆమె నామాటలకు ఆశ్చర్యం వెలిబుచ్చలేదు. నేను తిరిగి, 'యేమయినా సరే, నీ కూతురుని నాకిచ్చి పెళ్ళిచెయ్యి' అని అడిగాను. ఒకుసాన్ ప్రశాంతంగా 'సరే. కాని ఏమంత తొందరవచ్చింది?' అంది. వెంటనే నేను, 'అవును. వెంటనే పెళ్ళి జరిగిపోవాల్సిందే' అని జవాబిచ్చాను. ఆమె నవ్వింది. హఠాత్తుగా ఈవిషయం ప్రస్తావించినా నిరంతరం ఆలోచిస్తూనే వున్నానని తెలిపాను. ఒకుసాన్ నాకంటె ప్రశాంతంగా ఉంది. మగవాడిలాగా ఆమె మనసు స్వచ్ఛమయింది. వెంటనే ఒక నిర్ణయానికి రాగలిగింది.

'సరే. నీకిచ్చి పెళ్ళిచేస్తాను' అంది. 'చూస్తే నీవు నన్ను బతిమాలుతున్నట్టుంది. నిజానికి మా అమ్మాయిని చేసుకోమని నేను నిన్ను బతిమాలవలసింది. నీకు తెలుసుగా? తండ్రిలేనిపిల్ల!'

మాసంభాషణ నిరాడంబరంగా స్పష్టంగా సాగింది. ఒకుసాన్ నన్నేమీ అడగలేదు. బంధువులతో సంప్రదించవలసిన అవసరం లేదంది. అంతేకాదు, పెళ్ళికూతురును అడగవలసిన పని కూడా లేదని స్పష్టంగా చెప్పింది. ఈ విషయాలలో ఆమెకంటె ఎక్కువగా చదువుకున్న నేనే సంప్రదాయాలకు, లాంఛనాలకు కట్టుపడివున్నట్లు తోచింది.

'సరే, బాగానే వుంది. నాకూతురికి యిష్టంకాకపోతే యెలా యిచ్చి పెళ్ళిచేస్తాను?' అంది.

# 15

ఈ విషయం ఆమె కూతురికి సాధ్యమయినంత త్వరలో తెలియజేయవలసిందని చెప్పి నాగదికి వెళ్ళిపోయాను. తలపెట్టినపని సుళువుగా అయేసరికి విచిత్రం అనిపించింది. గదిలో ఊరికే కూర్చోలేకపోయాను. హాటుపెట్టుకుని చాలా దూరం షికారు వెళ్ళాలనే ఉద్దేశంతో బయలుదేరాను. ఒకుసాన్ ఆమె కూతురుతో పెళ్ళివిషయం ప్రస్తావించడం వాళ్ళిద్దరూ ఒంటరిగా కూర్చుని మాట్లాడుకోవడం ఊహించాలని యత్నించాను. ఇంతదూరం నడిచినా చిత్రమేమిటంటే, కె విషయమే నేను తలపెట్టలేదు. కాని ఒకుసాన్స్ ఇంటిసింహద్వారం తెరవగానే కె విషయంలో నేను ద్రోహం చేశాననే భావం నాలో తిరిగి రగిలింది. నేను అతనిగదిలో నుంచి వెళుతూంటే పుస్తకం చదువుతున్నవాడల్లా తలపైకెత్తి నాకేసిచూసి, 'వంటో తేలిగ్గావుందా? డాక్టరుదగ్గరకి వెళ్ళి వచ్చావా?' అని అడిగాడు. ఆ సమయంలో అతనిముందు మోకరిల్లి క్షమించమని వేడుకుందామని బుద్ధిపుట్టింది. ఏ అడవిమధ్యనో గనక మేమిద్దరం నిలబడిఉంటే నాఅంతరాత్మ ఆజ్ఞను శిరసావహించి అక్కడికక్కడే అతనిని క్షమించమని కోరేవాడిని.

మధ్యాహ్నభోజనాల సమయంలో ఒకుసాన్‌కూతురు కనిపించలేదు. ఎందుకురాలేదని ఒకుసాన్‌ని అడగగా బహుశా సిగ్గుపడుతూండవచ్చని సమాధానమిచ్చింది. కె కి ఇదంతా

అగమ్యాగోచరంగా ఉంది; కాని ఈవిషయం మరి కొనసాగనీయ లేదు. ఇకముందు కె ఎడల నేను ఎటువంటి వైఖరి అవలం బించాలో నిర్ణయించుకునే అవసరం ఈ ఘటనలవల్ల ఏర్ప డింది. రోజులకి రోజులు గడిచాయి. కాని నేను ఏనిర్ణయానికీ రాలేకపోయాను. పూర్వంకంటె ఇప్పుడు ఒకుసాన్ కూతురు నాతో ఎక్కువ చనువుగా మెలగడం కె అనుమానాలను రేకెత్తిస్తుందని నేను భయపడ్డాను. కె కి అంతా చెప్పివేయ వలసిందని ఒకుసాన్‌తో చెపుదామనుకున్నాను. కాని కె కి, నాకు జరిగినదంతా ఆమెకి చెప్పితే నాబలహీనత నా ప్రేయ సికి తెలిసిపోతుంది. పెళ్ళికాకపూర్వమే విశ్వాసాన్ని కోలు పోవడం భరించరాని దురదృష్టంగా నేను భావించాను.

నిజాయితీగా నడుచుకోవాలని యత్నిస్తూ కాలుజారి పడ్డ తెలివితక్కువ మొద్దును నేను. లేకపోతే జిత్తులమారిని అనుకోవాలి. ఈ విషయం నాఆత్మకు పరమాత్మకు మాత్రమే తెలుసు. ఈ సందిగ్ధావస్థమూలంగా నాకాళ్ళు నేలకు అంటు కునిపోయాయని గ్రహించాను. ఒక్క అడుగుకూడా ముం దుకు వేయలేకపోయాను.

అయిదారు రోజుల తరవాత పెళ్ళివిషయం కె కి తెలియపర్చావా అని ఒకుసాన్ హఠాత్తుగా నన్ను అడి గింది. 'లేదు' అని జవాబిచ్చాను.

'నేను తెలియజేసినపుడు అతను చిత్రంగా కనిపించ డంలో ఆశ్చర్యమేమీ లేదు. అంతప్రాణస్నేహితుడితోకూడా చెప్పకుండా దాచిపెట్టుకోవడం యేమాత్రం బాగుండలేదు' అంది.

నా పెళ్ళివిషయం ఎత్తగానే కె ఎలా ప్రవర్తించాడని ఒకుసాన్‌ని అడిగాను. ఆమె చెప్పినదానినిబట్టి ఈ ఆఖరి దెబ్బకు కె ఆశ్చర్యపోయాడనీ ప్రశాంతతమాత్రం పోగొట్టుకోలేదనీ తేలింది. 'అలాగనా!' అన్నాడట. ఇలా అని చిరునవ్వు నవ్వి లేచి నిలబడి 'నాకెంతో సంతోషంగా వుంది' అన్నాడట. కచేరీగదితలుపు తెరుస్తూ 'పెళ్ళి యెప్పుడు?' అని ప్రశ్నించి, 'వాళ్ళకి మంచి బహుమతీ యివ్వాలని వుంది. కాని చేతిలో డబ్బు లేదు.' అన్నాడట.

ఒకుసాన్‌కి ఎదురుగా కూర్చుని ఈ కథంతా విన్నాను. ఏమాత్రం ఊపిరిఆడకపోతే కలిగేటంత విపరీతమయిన బాధ నా గుండెలో బయలుదేరింది.

## 16

నా వివాహం విషయం తెలిసి రెండురోజులయినా నాపట్ల కె వైఖరిలో మార్పేమీ రాలేదు. నా మనసులో మా ఇద్దరినీ పోల్చుకుచూస్తే నాకంటె కె గొప్పవాడుగా కనిపించాడు. 'నాపన్నుగడ విజయవంతమయినా, నేను మానవునిగా అపజయం పొందాను' అనే ఆలోచన నా హృదయంలో సుడిగాలిలాగా రేగింది. కె నన్నెంతగా ఏవగించుకుంటున్నాడో అని అనుకుని సిగ్గుపడ్డాను. ఇప్పుడు అతని దగ్గరకు వెళ్ళి అవమానంపొందడం నా ఆత్మగౌరవానికే భంగకరం. ఆరోజు ఆదివారం. ఏనిర్ణయానికీ రాలేక మరునాటివరకు వేచిఉందామని నిశ్చయించుకున్నాను.

కాని ఆరాత్రే కె ఆత్మహత్యచేసుకుని చనిపోయాడు.

ఆ దృశ్యం తలుచుకుంటే ఇప్పటికీ నాకు వణుకుపుట్టుతుంది. నేను సామాన్యంగా తూర్పుదిక్కుకు తలపెట్టుకుని పడుకుంటాను. కాని ఆరాత్రి పడమటదిక్కుగా తలపెట్టుకుని పడుకున్నాను. ఇదేదో యాదృచ్ఛికంగా జరిగింది కాదు. చలిగాలి నాతలకు తగలడంమూలాన నాకు మెలుకువ వచ్చింది. నాగదికీ, కె గదికి మధ్య తలుపు తెరుచుకుని ఉండడం గమనించాను. కె గదిలోకి చూశాను. వేడిమి భరించలేక పరుపు చుట్టచుట్టి కాళ్ళవైపున పెట్టినట్టుంది. కె తల అటువైపుకు పెట్టి పక్కమీద బోర్లబొక్కలా పడుకుని ఉన్నాడు. కె ని పిలిచాను. పలకలేదు. శరీరం కదలనయినా కదలలేదు. మినుకు మినుకుమనే దీపపువెలుతురులో గదిఅంతా కలయజూచాను.

హఠాత్తుగా మొదటిసారి కె తనప్రేమనుగురించి ప్రస్తావించినపుడు నేను ఏ స్థితిలోపడ్డానో సరిగా అదే స్థితిలో ఇపుడు పడ్డాను. గది లోపలిభాగం నాకంటపడేసరికి నారెండు కళ్ళూ గాజుకళ్ళలాగా అయిపోయి చలించలేదు. కాళ్ళు నేలకు అంటుకుపోయినాయి. వాన వెలిసినట్టు ఈ స్థితి దాటిపోగానే నేను భయంకరమయిన గందరగోళం తెచ్చిపెట్టానని తలపోశాను. మహావిపత్తు సంభవించిందనే పూర్ణచైతన్యం నన్ను గాయపరిచింది. ఒక్కక్షణంలో నా భవిష్యత్తంతటి మీదా తన కీనీడను పరపింది.

అయినా నన్నునేను మరిచిపోలేక పోయాను. వ్రాతబల్ల మీద నాకు కె వ్రాసిన ఉత్తరం కనిపించింది. ఉద్రేకంతో తెరిచి చూశాను. నాకు తీవ్రంగా బాధకలిగించే

వాక్యాలు ఎన్నో ఉంటాయని అనుకున్నాను. ఒకుసాన్, ఆమెకూతురు ఆ ఉత్తరం చదివితే నన్నెంతగా ఏవగించు కుంటారో అని భయపడ్డాను. ఉత్తరం చదివాను. మనసు స్థిమితపడింది. అది సామాన్యపు ఉత్తరం. తనకు బొత్తుగా మనోనిబ్బరం, ధారవ లేవనీ అందువల్ల భవిష్యత్తులో ఆశ నశించి ఆత్మహత్యచేసుకుంటున్నాననీ కై వ్రాశాడు. దయతో ఆదరించినందుకు కృతజ్ఞతాభివందనాలు తెలుపుతూ చనిపోయిన తరవాత తన వ్యవహారాలన్నీ చూడవలసిందిగా నన్ను కోరాడు. ఈవిధంగా చనిపోయి కష్టాలు తెచ్చిపెట్టినందుకు ఒకుసాన్‌కి తనపక్షాన క్షమా ర్పణ చెప్పమనీ, తన మరణవార్తను తన బంధువులకు తెలియజేయమనీ నన్ను వేడాడు. అవసరమయిన విషయా లన్నీ చిన్న చిన్న మాటలలో చెప్పాడు. కాని ఒకుసాన్ కూతురువిషయం ప్రస్తావించలేదు. ఆమె పేరు బుద్ధిపూర్వ కంగానే కై ఎత్తలేదని నేను గుర్తించాను. ఉత్తరంకింద పరా ఉంది. అందులో తాను ఇదివరకే ఎన్నడో చనిపోవలసిందనీ ఇప్పటివరకూ ఎందుకు బతికిఉన్నదీ తనకే అర్థంకావడం లేదనీ వ్రాశాడు. ఈ మాటలు నాకు ఆశ్చర్యం కలిగించాయి; బాధించాయి.

కవరులో ఉత్తరం పెట్టి వెనుదిరిగిచూసేసరికి కై శరీరం లోనుంచి ప్రవహించిన నెత్తురు చారలు తలుపుమీద కనిపించాయి.

హఠాత్చలనంతో కై తల చేతులతో పట్టుకుని కొద్దిగా పైకెత్తాను. అతనిమొహంవంక చూడాలని బుద్ధిపుట్టింది.

కాని తల బరువుగాఉంది. వణికిపోయి చేతులు వెనకకు తీసేసుకున్నాను. నాకు ఏడుపురాలేదు. భయంలో మునిగి పోయాను. ఏమిచేయాలో తోచక నాగదిలోకివెళ్ళి దొడ్డిలో పెట్టిన ఎలుగుబంటిలాగా తిరుగాడజొచ్చాను. పక్కగదిలోని దృశ్యాన్ని ఒకుసాణ్ కంటపడనీయకూడదని గుర్తించాను. ఇక ఆమెను లేపడంలో అర్థంలేదు. అంతేకాదు. ఆ దృశ్యం చూచి ఆమెకూతురు భయపడిపోవచ్చు. అది నా కేమాత్రం ఇష్టంలేదు. మాటిమాటికీ గడియారం చూడసాగాను. ఆ గదిలో అటూ ఇటూ ఊరికే తిరుగుతూ ఎప్పుడు తెల్ల వారుతుందా అని అర్రులుసాచాను. ఆ చీకటి కలకాలం ఇలానే ఉండిపోతుందనే భయంతో నరకయాతన అనుభ వించాను.

ఆరుగంటలు కావస్తోంది. వెళ్ళి దాసీదానిని లేపాను. నా మాటలు విని ఒకుసాన్‌కూడా లేచింది. నా గదిలోకి రమ్మని చెప్పాను. మేము నాగదిలోకి ప్రవేశించగానే పక్క గదిని చూపించి, 'భయపడవద్దు. కె ఆత్మహత్య చేసు కున్నాడు' అని తెలియజేశాను. నా మొహంవంక చూస్తూ నిశ్శబ్దంగా నిలుచుంది. హఠాత్తుగా నేను కూర్చుని వంగి నమస్కరించి 'యిదంతా నా తప్పు. నిన్ను, నీకూతురిని కష్ట పెడుతున్నాను. క్షమించు' అన్నాను. ఈ మాటలు ఎందుకు అన్నానో నాకే తెలియదు. కెని క్షమాపణకోరే అవకాశం లేదు. కాబట్టి ఒకుసాన్‌ని క్షమాపణకోరుతున్నానేమో ! నా సహజసత్వము బలీయమయింది. నా ప్రాపంచిక స్వత్వము దానిని అదుపులోపెట్టలేకపోయింది. అందువల్లనే

ఉద్రేకంతో పశ్చాత్తాప వాక్యాలు పలకగలిగాను. ఆమె మొహం పాలిపోయింది. నన్ను పరామర్శిస్తూ, 'యిది హఠాత్తుగా తలవనితలంపుగా జరిగిన సంఘటన. ఇందులో యెవరి దోషమూ లేదు' అంది. కాని ఆశ్చర్యం, భయం ఆమె మొహంలోని కండరాలను నొక్కిపట్టివేశాయి.

# 17

చిన్న కత్తితో గొంతుకోసుకున్నాడు. వెను వెంటనే కె చనిపోయాడు. తలుపులమీది నెత్తురు అతని దేహంలో నుంచి వెలువడిందే.

నేను డాక్టరు దగ్గిరికి, పోలీసు స్టేషనుకు వెళ్ళాను. అవసర కార్యక్రమం ముగిసేవరకూ ఒకుసాణ్ ఎవరినీ కె గదిలోకి వెళ్ళనీయలేదు. మా బుద్ధి, నేర్పుతో గదిఅంతా శుభ్రంచేశాము. పరుపులు నెత్తురును చాలాభాగం పీల్చివేశాయి. అందువల్ల నేలమీద పరిచిన చాపలకు ఎక్కువగా నెత్తురు అంటలేదు. అతని దేహాన్ని నా గదిలోకి తీసుకుని వచ్చి నిద్రపోతున్న భంగిమలో పడుకోబెట్టాము. అతని ఇంటికి తంతి ఇచ్చేందుకని బయటికి వెళ్ళాను.

నేను తిరిగి వచ్చేసరికి అతనితల దగ్గిరగా ధూపం వెలుగుతోంది. ఒకుసాణ్, ఆమెకూతురు గదిలో కూర్చుని ఏడుస్తున్నారు. నాకూ ఏడుపువచ్చింది. ఏడ్చేశాను. కాని ఈ దుఃఖంతో నా హృదయభారం ఎంత తీరింది! బాధతో భయంతో గడ్డకట్టుకునిపోయిన నా హృదయం ఇప్పుడు కరిగిపోసాగింది.

కె తలిదండ్రులు వచ్చినతరవాత జోషిగాయా సమీపంలోని గోరీలదొడ్డిలో కె ని సమాధిచేశాం. నేను బతికున్నంతవరకు ప్రతినెలా అతనిసమాధివద్ద పశ్చాత్తాపం వెల్లడించాలని నిశ్చయించుకున్నాను.

కె తలిదండ్రులు, ఒకుసాన్, ఆమెకూతురు, కె స్నేహితులు – ఒకరేమిటి అందరూ కె ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడని నన్ను అడిగారు. ఈ ప్రశ్న ఎదురొక్కన్నప్పుడల్లా సూదితో గుచ్చినట్టు నా అంతరాత్మ బాధపడసాగింది. ఆ ప్రశ్నలో, 'అతనిని నేనే చంపానని తొందరగా ఒప్పేసుకో' అనే ధ్వని వినిపించేది. కాని నేను మాత్రం కె చనిపోయేముందు నాకు వ్రాసిన ఉత్తరంలోని సంగతులు చెప్పాను. కె ఆత్మహత్యను గురించిన పత్రికావ్యాసాలు అతని స్నేహితులలో ఒకరు నాకు చూపించారు. ఈ సందర్భంలో ఒకుసాన్ కూతురుపేరు పత్రికలకు ఎక్కుతుందేమోనని భయపడ్డాను. కాని అదృష్టవశాత్తూ అటువంటిదేమీ జరగలేదు.

ఆ తరవాత తొందరలోనే ఈ ఇంటిలోకి మారాము. ఆ పాతయింటిలో నేనుగాని, ఒకుసాన్‌గాని, ఆమె కూతురుగాని ఉండలేకపోయాము. సంవత్సరంలోపునే నాకూ ఒకుసాన్ కూతురికి పెళ్ళి అయింది. అంతా సుఖంగా బతుకుతున్నాము. కాని, ఆ కీనీడమాత్రం నా సుఖానికి అంటిపెట్టుకునేఉంది.

# 18

వివాహం అయింతరవాత నా భార్య హఠాత్తుగా ఇద్దరమూ కలిసి కె సమాధిని దర్శించివద్దామంది. అదిరిపోయి, ఆమె అమాయకపు మొహంకేసి ఆపేక్షతో తేరిపారజూచాను. ఎందుకు అంతచిత్రంగా చూస్తున్నారూ అని అడిగింది. ఆమె కోరిక ప్రకారం జోషిగారూ వెళ్ళాము. నేను సమాధిశిలను నీటితో శుభ్రంగా కడిగాను. నా భార్య సమాధిమీద ఇన్ని పూలు పెట్టి ధూపం వెలిగించింది. నేను సమాధిముందు నిలబడి మనసులో తప్పంతా నాదే అని పదే పదే అనుకున్నాను. ఈ సమాధిశిలకింద పాతిపెట్టిన కె ఎముకలను గురించి ఆలోచించాను. ఆ తరవాత నా కొత్త పెళ్ళామునుగురించి ఆలోచించాను. విధివిలాసం ఇలా ఉందని అనుకోకుండా ఉండలేకపోయాను. నా భార్యను తీసుకుని కె సమాధివద్దకు ఇంకెన్నడూ రాకూడదని ఆరోజున నిశ్చయించుకున్నాను.

పెళ్ళిఅయితే నా చిత్తవృత్తి మారి కొత్త జీవితం గడపగలుగుతానని ఆశించాను. కాని బలంలేని ఆశను బలీయమైన వాస్తవికత నాశనంచేసివేసింది. నా భార్యకేసి చూచినపుడల్లా కె నన్ను బెదిరించసాగాడు. అంటే కెకీ నాకూ మధ్య నా భార్య నిలబడి అతనిఆత్మనుంచి నన్ను విడివడనీయకుండా బంధించివేసింది. నా భార్య అన్ని విషయాలలో సంతృప్తికరంగా ఉన్నా ఈ ఒక్క విషయాన్ని బట్టి ఆమెను తప్పించుకు తిరగాలని కాంక్షించాను. నా వైఖరి

అర్థంకాక, అపుడపుడు ఆమె ఆవేశంతో మాట్లాడేది. కె ఎదురుగా ఉన్నట్టు నా మనసులో చిత్రించుకుని, ఎంత నిజాయితీగా, ఎంత అణకువతో ప్రవర్తించానో అంత నిజాయితీతోనూ నా భార్యకు సర్వము చెప్పేసిఉంటే ఆమె నా పాపాన్ని క్షమించేది. కాని ఆమెస్మృతిలో నా విషయ మయి చెడుఅభిప్రాయం హత్తుకుపోతుందేమోనన్న భయంతో నే నామెకు చెప్పలేదు.

బాత్తిగా తోచేది కాదు. పుస్తకాలు చదవడంలో నిమగ్నుడనయిపోదామని ప్రయత్నించాను. కాని నా మన సుకు స్వస్థతచిక్కలేదు. మాబాబాయి నన్ను మోసంచేసిన రోజులలో మానవజాతిని నమ్మరాదని అనుకుంటూండేవాడిని. అపుడు ఇతరులను గర్హిస్తూ నన్నుమాత్రం నేను నమ్మే వాడిని. ప్రపంచం ఎంత పాపిష్టిదయినా నేనుమాత్రం నమ్మ దగినవాడననే విశ్వసించాను. కె మరణంవల్ల ఈ విశ్వాసం పటాపంచలయిపోయినందున నేను హఠాత్తుగా కంపించి పోయాను. నేనూ అచ్చంగా మాబాబాయివంటివాడినేనని గుర్తించాను. ఇతరప్రజానీకమంటే విసుగెత్తిపోయిన నాకు నేనంటేకూడా విసుగెత్తిపోయింది. ఇక ముందుకు సాగిపోలేక పోయాను.

సాకె తాగుతూ నను నేను మరిచేపోవాలని యత్నిం చాను. కాని త్వరలోనే ఈవిధానం నన్ను నిరాశాపూరితుణ్ణి చేసింది. దీనిఫలితంగా ఏర్పడ్డ కృత్రిమఉల్లాసం తరవాత విపరీతమయిన విచారం ముంచెత్తేది. మధ్యమధ్య నా భార్య ఏడుస్తూ, 'కె గనక బతికివుంటే మీరు యింతగా మారిపొయ్యే

వారు గారు' అనేది. ఒకమాటు నీ వన్నది నిజమయి ఉం టుంది అని సమాధానమిచ్చాను. కాని నా భావాన్ని ఆమె పూర్తిగా విభిన్నంగా అర్థంచేసుకుంది. నాకు చాలా విచారం వేసింది. కాని ఏదీ విశదీకరించుకోలేకపోయాను. తొందర లోనే సాకీతాగడం మానుకున్నాను. కాని ఒంటరితనం మాత్రం నన్ను వదలలేదు. ఈ ప్రపంచంలో దేనితోనూ సంబంధంలేకుండా పూర్తిగా ఒంటరితనం అనుభవిస్తున్న ట్టుండేది, ప్రేమ విఫలమయినందువల్ల కె ఆత్మహత్య చేసు కున్నాడని అనుకున్నాను. కాని నాలాగానే ఒంటరితనంతో విసుగెత్తి ప్రాణంతీసుకున్నాడని ఇప్పుడు అనిపిస్తోంది. నేను కె తొక్కినతోవనే పయనిస్తున్నాననే భావం శీతగాలిలాగా నా హృదయంలో వీచేసరికి నాకు వణుకుపుట్టింది.

# 19

నా అత్తగారికి జబ్బుచేసింది. ఉపచారం చేశాను. ప్రపంచానికి దూరంగా, మందకొడిగా పడిఉన్న నేను ఏదో కొంత మంచిపని చేశానని మొట్టమొదటిసారిగా భావించాను. ప్రాయశ్చిత్తభావం నన్ను కదిలించివేసింది. ఆమెచనిపోగానే నాభార్య తనకు నేను తక్క ప్రపంచంలో వేరే దిక్కులేదని చెప్పింది. నాలో నాకే నమ్మకంలేదు. ఆమెమాటలకు నా కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. పూర్వంకన్న ఎక్కువదయతో, ప్రేమతో ఆదరించాను. నన్ను అర్థంచేసుకోలేకపోవడంవల్ల జనించిన అస్పష్టమయిన ఆతురత ఆమెలో దాగిఉందని గ్రహించాను.

ఒకమాంటు స్త్రీ పురుషులు సానుభూతిపూర్వకమయిన సంసర్గం ఎందుకు సాధించలేరని ఆమె నన్ను అడిగింది. అలా సాధించడం పశుచుతనంలో సాధ్యంకావచ్చునని నేను అస్పష్టంగా సమాధానమిచ్చాను. ఆమె గతజీవితాన్ని తలచుకుని మెల్లిగా నిట్టూర్చింది. ఆనాటినుంచీ ముందుముందు ఏదో మహావిపత్తు నన్ను అణచివేస్తుందని భయపడసాగాను. ఒకొక్కపుడు పిచ్చిఎత్తుందని అనిపించేది.

పాపంచేశానని బాధపడ్డాను. ఈబాధే నన్ను ప్రతినెలాకె సమాధిదగ్గిరికి తరుముతోంది. ఈ భావంతోనే నడి బజారులో కొత్తవారెవరయినా నన్ను కొరడాతో కొట్టితే బావుండునని కోరుకునేవాడిని. ఈ బజారులలో తిరుగుతూంటే ఎవరోవచ్చి కొట్టకన్న నన్ను నేనే కొరడాతో కొట్టుకోవాలనీ, నన్ను నేనే కొట్టుకునేబదులు ప్రాణంతీసుకోవాలనీ అనుకునేవాడిని. ఏమిచేయడానికి తోచక జీవన్మృతుడిలా పడిఉన్నాను.

# 20

పనిచేసే శక్తికూడా నశించిపోయింది. నాలో ఎడతెగకుండా బాధాకరమయిన పోరాటం సాగుతోంది. నాలోని ఏదో ఒక నిగూఢమయిన భయంకరమయిన శక్తి ఒక్క మృత్యుమార్గాన నడుపుతూ తక్కిన మార్గాలలో కార్యాచరణకు అవరోధం కల్పిస్తోంది. నొసటిగీత ప్రకారం తేలికమార్గం పట్టాలని తలచాను గాని, నాభార్యమొహం చూసి మళ్ళీ మానుకున్నాను.

మంచి నడివేసవిలో హెయిజీచక్రవర్తి చనిపోయారు. హెయిజీ ఆత్మ ఆ చక్రవర్తితోనే జనించి ఆయనమరణంతో అంతమయిందని భావించాను హెయిజీ ఆత్మప్రభావం మామీద అమితంగా ప్రసరించిందేమో, ఆయన చనిపోయిన తరవాత మేము బతికిఉండడం అసంగతమని బలీయంగా నా మనసుకు తట్టింది. ఈమాట నాభార్యతో అన్నాను. ఆమె దీనిని తీవ్రరూపంలో తీసుకోలేదు. కాని హఠాత్తుగా నవ్వులాటకు చక్రవర్తిని అనుసరించమని చెప్పింది. నేనెప్పుడయినా ఆత్మహననమంటూ చేసుకుంటే హెయిజీఆత్మను అనుసరిస్తానని జవాబు చెప్పాను.

ఆతరవాత జనరల్ నోగీ మరణం వార్తాపత్రికలు ప్రచురించాయి. చనిపోయేముందు జనరల్ నోగీ వ్రాసిన యాదాస్తులు చదివాను. సీనాన్‌యుద్ధం జరిగిన ఒక సంఘటనలో నోగీచేతిలోని పతాకను శత్రువులు లాగివేశారు. ఈ విషయం నోగీయాదాస్తులలో చదువుతూ ఆయన చనిపోవాలనే సంకల్పంతో ఎంతకాలం బతికాడా అని వేళ్ళు ఒకొక్కటీ వంచి లెక్కపెట్టాను. తానుచేసిన పొరపాటుకు పరిహారంగా అప్పటినుంచీ చనిపోవాలనే సంకల్పించుకున్నాడు. సీనాన్‌యుద్ధం హెయిజీ రాజ్యానికివచ్చిన పదిసంవత్సరాలకి జరిగింది. అంటే ఆ సంఘటన జరిగి ముప్ఫయి అయిదు సంవత్సరాలయింది. జనరల్ నోగీ ఈ ముప్ఫయిఅయిదు సంవత్సరాలూ మృత్యువుకోసం నిరీక్షించాడు. బతికిన ఈ ముప్ఫయిఅయిదు సంవత్సరాలు ఎక్కువ బాధపడ్డాడా లేక

కడుపులో ఛురకత్తితో పొడుచుకున్న క్షణంలో ఎక్కువ బాధ పడ్డాడా ? అని ఆలోచించి ఆశ్చర్యపోయాను.

రెండుమూడు రోజుల తరవాత ఆత్మహత్య చేసుకోవాలని ఎలాగయితేనేం నిశ్చయించుకున్నాను.

ఈ నిశ్చయానికివచ్చి పదిరోజులు దాటింది. ఈ పది రోజులూ ఈ ఉత్తరం వ్రాస్తూ గడిపాను. నా గతజీవితంలోని మానవానుభవాన్ని నే నొక్కడనే విశదీకరించగలను. అందువల్ల ఆ గతజీవితాన్ని ఉన్నదిఉన్నట్లు వ్రాసిపెట్టడం, నీకూ ఇతర ప్రజానీకానికీ వ్యర్థప్రయత్నం అనిపించదనే భావిస్తున్నాను. పైగా మానవజాతిని అర్థంచేసుకోవడానికి ఎంతగానో ఉపకరిస్తుంది.

నా గతజీవితంలోని మంచిచెడుగులను ప్రజలకు అందచేయాలని నా ఉద్దేశం. కాని నాభార్యకిమాత్రం అది దక్కడానికి వీలులేదు. ఆమెకి ఏమీ చెప్పదలచుకోలేదు. ఆమె గతస్మృతులను సాధ్యమయినంత పవిత్రంగా ఉంచాలని నా కోరిక. అందువల్ల నాభార్య బ్రతికిఉన్నంతకాలం ఇదంతా నీకొక్కడికే చెప్పిన రహస్యంగా మనసులో గుప్తపరచమని నిన్ను వేడుకుంటున్నాను.

స మా ప్త ము

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | MB010354 | **Date** | 20-11-2021 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | CI, 114, 115 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared By** | Sameera | **Cutting By** | Sameera |
| **Scanned By** | Amrutha | **Pages** | 119 |